# ఆంధ్ర మహోద్యమ తత్త్వము


కొండూరు. శ్రీరాములు, ఎం., ఏ.

నెల్లూరు





శ్రీ వేమన గ్రంథాలయము,

తేలప్రోలు.

ఇండియా ప్రింటింగ్ ముద్రాక్షరశాలయందు ముద్రితము.

మదరాసు.

1920

# ఆంధ్రమహోద్యమ తత్త్వము



కొండూరు. శ్రీరాములు, ఎం., ఏ.

నెల్లూరు



ఇండియా ప్రింటింగ్ ముద్రాక్షరశాలయందు ముద్రితము.

మదరాసు.

1920

భ్రాతృవత్సలుఁడై,

సర్వశాస్త్ర వ్యాసంగనిరతుఁడై,

ఆంధ్రమాత పావనగర్భంబున జనించి, తత్సేవా పరత్వము నంగీకరించిన యుత్తరక్షణముననే దైవ దుర్విపాకముచే పిన్నవయస్సునందే కీర్తిశేషుఁడైనట్టి, మా అన్నగారైన,

కొండూరు కుమారస్వామి శాస్త్రిగారి

పూజ్యపాదములను భక్తితాత్పర్య నమస్కార పురస్సరముగా స్మరించి ఈగ్రంథమును అర్ఘ్య ద్రవ్యముగా సమర్పించు చున్నాఁడను.

కొండూరు శ్రీరాములు.

శ్రీ వేమన గ్రంథాలయము,
తెలప్రోలు.



# ప్రస్తావన

ఆంధ్ర సోదరులారా!

ఈ చిన్న పుస్తకము 1917 వ సంవత్సరమున ఆంధ్ర మహాసభ నెల్లూరుపురమందు జరిగినవెంటనే, రాష్ట్రప్రతివాదుల ఉపయోగార్థము వ్రాసియుంటిని. నాటినుండి దీనిని ప్రచురించుటకు నాకు వీలు లేకపోయెను. ఇట్టి ముఖ్యవిషయమున నీకాలవిలంబనకై క్షమింప వేడుకొనుచున్నాను. ఆసమయమున పరిస్థితులొకవ్యూహముగానల్లుకొనియుండెను. ఇపుడు కొంతమాఱినను అవియొక వ్యూహముగ బన్నియున్నవి. కాని ఈపుస్తకమునందు వానిని స్వల్పభేదములతో నట్లే యుంచితిని. ఏలననగా దీనిని వ్రాయుటయందు నాముఖ్యోద్దేశము మన జాతీయపరిస్థితుల చర్చింపవలెనని గాదు; ఇట్టి జాతీయపరిస్థితులకు బీజప్రాయములై కల్పించి, వానిని పరిణామదశ కాకృష్టిగావించు బలవచ్ఛక్తులను కొంత పరిశీలింపవలెనని. అందుచే పరిస్థితులు కొంతవఱకు మాఱినను మున్ను వ్రాసినదానిని మార్చ నావశ్యకత గన్పట్టలేదు. అదియునుగాక, పరిస్థితులు మారుటయు దీనియందు ప్రతిపాదించిన వాదమును బలపఱచుచున్నది.

అయ్యది మన మిప్పటిసందర్భములను అప్పటివానిని సరిపోల్చి చూచిన తేటపడగలదు.

ఈ గ్రంథమునందు రాష్ట్రవాదముయొక్క గుణాగుణములు శాస్త్రతః పరిశీలింపవలెనని గడంగితిని. ఈసందర్భములో ఆధునికశాస్త్ర సిద్ధాంతములెన్నియో పేర్కొనవలసి వచ్చెను. అందఱికి నియ్యవి పరిచితములుగావు గాన వానినాయాపట్ల విశదీకరించ ప్రయత్నించితిని. కొన్నియెడల నేను చెప్పిన వ్యాసవచనములు భావమును తేటతెల్లగాఁజేయుటకు చాలియుండవు. కొన్నియెడల భావ మనుమేయముగా నుంటం బట్టి వ్యాఖ్య మానితిని. ఆశాస్త్రసిద్ధాంతములన్నియు నిర్వివాదముగాఁ జేయుటకు రామాయణములు, భారతములు కావలసియుండును. అందుచే ముక్తసరిగ ముగించితిని. అదియునుగాక నయ్యవి చర్చించి గుణదోషములు తేల్చుట ఈపుస్తకమందు ప్రస్తుతముగాదని తోఁచెను. కొన్నియెడల పాశ్చాత్య శాస్త్రములయందుఁ గన్పట్టని సమాధానముల నొసఁగితిని. జీవాంకురమందు మమత్వప్రతిపాదనమును, జీవాంకురముయొక్క అల్పాయుష్యనకును, బహురూపతకును, అత్యనారతప్రవృత్తులకు హేతుప్రతిపాదనమును ఇట్టివి. ఈసమాధానములు యుక్తియుక్తములుగను శాస్త్రావిరోధములుగ నుండుటచే శాస్త్రవిదులు వీనియందలి యాథార్థ్యమును పరీక్షింపనర్హులు. మఱికొన్నియెడల పాశ్చాత్యశాస్త్రములయం దుద్ఘోషింప

బడిన సిద్ధాంతముల ఖండించితిని. మాత్స్యన్యాయసిద్ధాంతము ను నేనొప్పుకొనువాఁడను కాను. అయ్యది విశ్వమును పాలించుదర్మమని నాకుఁ దోచుటలేదు. మీఁదుమిక్కిలి అది విశ్వసుస్థితి కవరోధకరమై కంటిలోని నలుసువలె బాధించుచున్నది. ఈయాలార్క విషమును వెలిబుచ్చినగాని విశ్వము నైసర్గికమైన ఆరోగ్యస్థితికి రాఁజాలదు. అది విశ్వమునకెట్లు వెలియైనయవస్థ (Abberation from the natural condition) యైనదియు, సకారణమైనను తాత్కాలికమును, ఆపాతము నెట్లైనదియు ప్రత్యేకముగా మఱియొక గ్రంథమునచర్చించవలసినదేగానిఇచ్చోఁగాదు.

ఈపుస్తకమందలి సిద్ధాంతములును వాదసరణియు ఒక్క ఆంధ్రరాష్ట్రవిషయికము మాత్రమే కాదు. మనదేశమందలి ప్రతియుద్యమమునకును ఈవాదానువర్తనముచే గుణాగుణములు తెలియఁగలవు. అణువుమొదలుకొని, బ్రహ్మాండాత్మకమైన ఈవిశ్వమునకంతయు ఒక్కటే ధర్మమని నాయాశయము. కావుననే బహుజనము ఖండించు అబ్రాహ్మణోద్యమమును ఇంకనితరములైన శాఖోపసంఘములను నేను సమర్థించి వానియందలి సుగుణముల వ్యక్తీకరించి యుపద్రవము లుండునెడ హెచ్చరించితిని. ఆంధ్రద్రవిడాదిజాతులయెడఁ జెప్పిన సిద్ధాంతమునే కులములయెడను (Castes) కులోపశాఖలయెడను ఎట్లుపయోగించితిమో, అట్లే జర్మను, ఇంగ్లీషు, హైందవాది మహాజాతుల (Races) యెడనైతము పయోగించుకొని

వారి యన్యోన్యాక్రమణములచేఁ గల్గు చేటులు గుర్తెఱుంగ నగును.

ఈపుస్తకమునం దక్కడక్కడ పునరుక్తి గానవచ్చును. ఒకేవిషయమును అనేక శాస్త్రరీతులచే పరిశీలించుటచేఁ గలిగిన యవస్థయేగాని ఇయ్యది యొకదోషము గాదు. ఇంతియకాక సద్భావముల నిట్టి పునరుక్తి సమ్మోదముప్రభవము గావున దాని నట్లేయుంచితిని.

దీనింజదువుటవలన ఆంధ్రులలో నొక్కని కేనిన్ శాస్త్రచక్షువు గలిగెనేని నేను కృతార్థుఁడను.

శాస్త్రవిషయమునందు నాకు ప్రవేశము గలిగించిన శ్రీయుత॥ వీరభద్రశర్మగారికిని, ఈగ్రంథము వ్రాయుటలో సహాయమొనరించిన మామిత్రుఁడు శ్రీమాన్॥ సి. ఆర్. కృష్ణమాచార్యులగారికిని నేనెంతయు కృతజ్ఞుఁడను.

నెల్లూరు.
1 - 5 - 20

ఇట్లు విన్నవించు
భవత్సోదరుఁడు.
కొం॥ శ్రీరాములు.

శ్రీః

# ఆంధ్ర మహోద్యమ తత్త్వము.



ఆంధ్రసీమయం దెచ్చోట జూచినను నూతనావేశ మొకటి గన్పట్టుచున్నది. ఈ యుత్సాహము సద్యోజాతమై ఇదివఱకు నిద్రించుచుండిన ఆంధ్రజనుల నాక్రమించి వారి యందు భ్రాతృభావము పెంచుచున్నది. హిందూదేశమంతయు కలఁదెలిసి హిందువులస్వత్వమును స్మరణకుదెచ్చు ప్రయత్నముననుండ ఆంధ్రులు తమజాతిస్వత్వమును తమవారి హృదయములయం దంకురింపజేయ పాటుపడుచున్నారు. ఆంధ్రుల ప్రయత్నము హైందవోద్యోగమునకు ప్రతిధ్వని. హైందవాదర్శముల నెట్లు కొందరు హైందవ ప్రముఖులు బడయగోరుచున్నారో అట్లే ఆంధ్రులునై తము తమజాతీయాదర్శములఁ జేర జూచుచున్నారు. స్వస్వజాత్యాదర్శముల నాయాజాతియందు నెలకొల్పినగాని, భిన్నజాతులకుటుంబమైన ఈహిందూదేశమున హైందవాదర్శములఁ బొందఁగోరుట తలపెట్టరానిపని. దేహమందు ప్రత్యంగసౌష్ఠవమే సంపూర్ణదేహసౌష్ఠవమున కెట్లు కారణమో, అట్లే హైందవజాతియందును ప్రతిజాతిసౌష్ఠవము జాతీయారోగ్యమునకు మూలము. హిందూదేశమునంగల జాతులలో నెయ్యదిగాని తనజాతిస్వత్వమును గోలుపోయి అన్యజాతిసంపర్కమున తనయాదర్శములను సందేశమునుమరచి

అన్యజాతిచే నాక్రమింపబడిన పక్షమున అంతవఱకును హైందవజాతియొక్క స్వత్వమునకు న్యూనతగల్గుచున్నది. హైందవ జాతి అంతవఱకును సంపూర్ణ స్ఫురణమున వెలుగక వెలిచీర కుమసిదాకినట్లు కళంకితమై యుండును. దేహములో నేభాగము రోగపీడితమైనను, ఆరోగ్యమునకు వెల్తియేగదా! మఱియు, భిన్నజాతు లన్యోన్యమాక్రమించి తమ యాదర్శములను పరస్పరము జంపుకొనుటచే భగవత్సంకల్పము వృథయగును. ప్రతి జాతికిని తదితరములకంటె భిన్నమైనస్వస్థితిని, స్వరూపమును, స్వవ్యాపారముల నేర్పఱచిన భగవంతున కుద్దేశము లేక పోయెనా? యేజాతి తనతనస్థానమందు నిలిచి, తనకువిధించిన స్వరూపమున సంపూర్ణముగా విలసించి, నిజవ్యాపారములయందు చరించుచు తనకంటె భిన్నములైనజాతులకు తమతమ వ్యాపారములజేయఁ దోడ్పడుచు, సృష్టివైచిత్ర్యమును వెల్లడించుటయే నైనసంకల్పము. ఈవిషయము రాత్రియం దాకసమువంకజూచినచో తేటపడగలదు. లెక్కకు మిక్కిలియైన ఖగోళములు నానావిధపరిమాణములుగలవై నిజవ్యాపార పరాయణములై అన్యోన్య మెంతమైత్రితో ప్రవర్తించుచున్నవి! ఈగోళములలో నెయ్యదిగాని ఆవంత తనతేజమును గోలుపోయినచో నేమిరాగలదు? తేజముగ్రుంగుటచే నాకర్షణ శక్తియును గ్రుంగును. అన్యోన్యాకర్షణశక్తిచే నిప్పుడు తులతూగినట్లుండు నీఖగోళములన్నియు స్థానభ్రష్టములు కాఁగలవు. తన్మూలమున నీగోళములు తమ ఆవర్తపరివర్తనములచే నొండొంటితోడీకొని పిండిపిండికాగలవు. కావుననే ఆయాగోళము తనతన వ్యాపారములను నిండుతేజముతో జరుపుచున్నది.

ప్రపంచమునందు సైతము ఒక్క గడ్డిపఱక, ఒక్క అణువైనను సరే తనవ్యాపారమును మానినను, లేకమార్చినను, చరాచరాత్మకమైన ఈసర్వవిశ్వమునకును బాధగలుగఁగలదు. వ్యాపారము మార్చుటయేగాదు. తన తేజము నెంతమాత్రము విసర్జించినను లేక తనకువిధించిన సంపూర్ణస్ఫురణకంటె మిక్కిలిగా ప్రకాశించినను, బ్రహ్మాండముల కన్యోన్యసంఘర్షణము గల్గును. బ్రహ్మాండములపాలించు ధర్మమే జాతులసయితము పాలించుచున్నది. విశ్వమునకంతయు ధర్మమొక్కటియే. జాతులు విశ్వమునకు వెలియైనవిగావు. కావున జాతులును ఆధర్మముచేతనే పాలింపబడవలెను. జాతి ఆధర్మమును పాటింపక విశ్వమును పీడించునాఁడు విశ్వముయొక్క ప్రతీపీడనము స్వధర్మాపరాధినియైన ఆజాతిపై రాగలదు. అందుచే జాతిలయించి దాని స్థానమున స్వధర్మపరాయణమైన నవీనయొకజాతి ప్రవేశించును. అట్లు లేక విశ్వప్రతిపీడనమునకుఁ గూడ ఆజాతిమిక్కిలియైనచో పరస్పరపీడనములచే విశ్వమే నశించును. కావుననే జాతికి స్వీయమగు రూపమునకు నాశము గలుగఁ జేయుటగాని, స్వవ్యాపారముల మార్చుటగాని, నిండు తేజముతో విలసింపక పోవుటగాని జాతికే అపాయకరము, లేదా ప్రపంచమునకపాయకరము. అట్లే జాతిసంకరముకూడ కూడనిపని.

హిందూదేశము ఏకభాషనుగ్రహించి యేకజాతి యగుననుమాట కల్ల. మనదేశమందు సమష్టిజాతిత్వము సాధ్యమగునేగాని, ఏకజాతిత్వము సాధ్యముగాదు. వాంఛనీయమునుగాదు. ప్రకృతిచేతనే భిన్నధర్మములతో నేర్పడిన

అంగములకు సాధర్మ్యము[1] కల్పింపఁబూనుట అవివేకము. అంగసాధర్మ్యము విశ్వమునకు బాల్యస్థితియందలి లక్షణము. చేతనములన్నిటిలో చిన్నదియగు జీవాంకురమున [2] కిట్టిసాధర్మ్యముగలదు. జీవాంకురముదశనుండి మనుష్యునిదశకు వచ్చుకొలదిని ప్రాణి ఈధర్మమునువిడిచి, కడపటిదశయందు భిన్నధర్మములుగల యంగములను గ్రహించును. సాధర్మ్యము ప్రాణికి బాల్యలక్షణమేకాక దానికి చేటునుగూడ గూర్చుచున్నది. జీవాంకురమం దట్టిధర్మముండుటచే దానిలో ప్రతిభాగమును ప్రతిధర్మమును నిర్వర్తింప యత్నించుచున్నది. జీవాంకురమన్నిభాగములతోడను భుజించును, అన్నిభాగములతో స్పృశించును. అన్నిటితో నుచ్ఛ్వాసనిశ్వాసముల జరుపుచుండును. కాని దేనినేని భుజించునప్పుడుగాని, స్పృశించునపుడుకాని, నిశ్వసించునప్పుడుగాని ఆయావస్తువులు జీవాంకురముయొక్క ఉపరిభాగముతోడనే సంపర్కము నందుచున్నవి. కావున దానియందలి అంతర్భాగములు సంపర్కముకొఱకై గమకించును. ఇట్లుగమకించుటలో నయ్యవి ఉపరిభాగములతో స్పర్థించవలసియుండును. నిరంతరముజరిగెడు నీస్పర్థయే జీవాంకురముయొక్క బహురూపతకును అనారతప్రవృత్తికిని, అతిప్రవృత్తికిని కారణము. ఈ అతిప్రవృత్తియే దానియొక్క అల్పాయువునకు హేతువు. కావున చేతనములకు సాధర్మ్యము బాల్యదశయేకాక దీర్ఘాయువునకును ఆటంకమైయున్నది. ఈహేతువునుబట్టియే చేతనమునకు వృద్ధిగోరువారు

---

1. Homogeneity of function.

2. Amoeba.

దానియందు ప్రత్యంగసాధర్మ్యమును గల్పింపరాదు. అట్లు చేయుటచే తమయుద్దేశమున కంతరాయములు తామే తెచ్చి పెట్టుకొందురు. నైసర్గికముగా నేయేయంగములు స్వస్వరూపములతో నేర్పడినవో, ఆయాయంగముల స్వరూపములను స్వకర్మములను పరిపూర్ణస్ఫురణముతో నుండునట్లు పోషింపవలెను.

హైందవజాతియు ఒక్క చేతనమే. చేతనమునకు శాస్త్రవేత్తలు నిర్ణయించిన లక్షణములన్నియు దీనికిని గలవు. అవి యేవన (౧) భుజించుట (౨) పెఱుగుట (౩) సంతానము గనుట (౪) మమత్వము. [1]మొదటిమూఁడును విశదీకరింపవలసి

I. Western scientists have called this last "Response to stimulii." But this response is again the effect, not the cause. A prick of a pin causes the amoeba to contract or withdraw that particular part of its body because the other parts of the amoeba feel the identity of their interest and existance with the part affected. Thus it is clear that the Response of the Western Scientist is only the effect of the sense of మమత్వము, the oocular evidence of its presence in the amoeba, which I again distinguish from the మమకారము of the Indian philosopher మమత్వము is more akin to what i s termed అహంకారము by the philosophers, the consciousness of one's own ego, though at the same time, substantially different from it, while మమకారము is the desire for the things external, things objective as is clearly denoted by the word మమ meaning 'belonging to me'. మమత్వము as I have used it, is the sense of the identity of interest and existance of one part of an organism with the rest of the parts and is evidenced by the response it gives to external stimulii.

నదిలేదు. నాల్గవదగు మమత్వము చేతనమునకును దానియొక్క అంతర్భాగమునకును గలసంబంధమునకు కారణము. యాదృచ్ఛికముగా నలుగురుమనుష్యు లొకచోగూడినపుడు వారినల్గురికిని మొదటిమూడులక్షణము లుండవచ్చును. కాని కడపటిది లేనిచో వారిసమాజము ఒక చేతనముకాజాలదు. ఒకకుటుంబమునందు వారలకు మొదటిమూడుండుటయేగాక, నాల్గవదగు మమత్వమునుగలదు. తండ్రి తనయుని తనవాఁడనియు, భార్య భర్త తనవాఁడనియు స్వాభావికముగానే భావింతురు. కావున ఈమమత్వము కుటుంబమునందు అంగాంగసంబంధమును కల్పించి, దానినొక (సమష్టి) చేతనముగా జేయుచున్నది. హైందవజాతికిని ఈనాల్గులక్షణములును గలవు. కావున నిదియు (సమష్టి) చేతనవ్యక్తియే అగును. హైందవజాతియం దాంధ్రులు, బంగాళీలు, అరవలుమున్నగు శాఖలవారు నైజస్వరూపములతోనుండ, ఆయాజాతినైసర్గికస్వరూపములనూపుమాపి అశేషజాతులకు సాధర్మ్యముకల్పించుట హైందవజాతిసుస్థితిని భాధచేయుటయే. అందుచే మనప్రయత్నములన్నియు నేయేశాఖవారి స్వరూపధర్మములను ఆయాజాతివారు పోషించుకొనజేయుటకు సహాయకారులుగా నుండవలెను.

మనప్రస్తుతపరిస్థితుల కొంతవిచారించి మన కేకజాతీయతగలదో, అయ్యదిలేసినాడు సమష్టిజాతీయత మనకుగలుగగలదో, సమష్టిజాతీయత గలుగవలసినపక్షములో ఆంగ్లేయులను, జపానుజాతివారినియితము కలుపుకొని మనమేల సమష్టిజాతీయత సమకూర్పరాదో తెలిసికొనవలెను. శాస్త్రవిదులు ఏకజాతీత్వమునకు ఐదంశములు ముఖ్యమని చెప్పియున్నారు.

(౧) దేశసామాన్యత (౨) భాషాసామాన్యత (౩) ఐతిహ్యము (౪) ఆదర్శసామాన్యత (౫) ఆచారపరంపర. జాతిత్వమును పోషించు అంశము లితరములున్నను అయ్యవి ప్రాధాన్యమును బొందజాలవు. ఈ ఐదింటినిబట్టియు మనదేశపరిస్థితులను చర్చించవలెను. మనకు దేశసామాన్యతగలదు. ముక్కోణాకృతిగల ఈవిశాలభూమి కిరుగడలను సముద్రమును, మూడవదగు ఉత్తరపుటెల్లను దుర్గమములై, అభ్రంకషములగు హిమవత్పర్వతములునుగలవు. కావున స్వరూపముచేతనే ఈదేశ మొక్క జాతికి ఆశ్రయము గాఁదగియున్నది. ఈదేశమందు జనుల కైతిహ్య మొక్కటియే. ఇదివరలో కన్నెఱుఁగనప్పుడు పరస్పర స్పర్థ లెట్లుండినను, నేత్రోన్మీలనముకలిగి ప్రపంచమునందుగల ఇతరజాతులజూచినపిమ్మట మనకు చరిత్రమంతయుసామాన్యమై మనమహాపురుషులు దేశకాలనియతిలేక కొనియాడబడుచున్నారు. పరాక్రమధుర్యులగు శివాజీ కృష్ణరాయులు అక్బరు మున్నగువారెల్ల స్మరణమాత్రమున మనయుల్లంబుల నుత్సాహపూరితములుగ జేయ సమర్థులు. వాల్మీకి వ్యాస కాళిదాసాది సంస్కృతమహాకవులును, తిక్కన తులసీదాసు కంబర్ మున్నగు దేశీయకవిసింహులును, తమవాగమృతముల దేశములందు వెల్లిగొలిపి అందరికిని పూజ్యులైరి. అనుశాసకులగు వేదమహర్షులును, గురువులగు వశిష్ఠకణ్వాదులును, శాస్త్రకర్తలగు పాణిని కాత్యాయనాదులును, మతస్థాపనాచార్యులగు బుద్ధ శంకరరామానుజ నానకాదులును, సంఘసంస్కర్తలగు ఆపస్థంభకుమారిలాదులును, హైందవ దేశమున కంతయు మహోపకారులును, వంద్యులును. వీరినెల్ల స్మరించినమాత్ర

మునసే ప్రతిహైందవునకును పీరుమనోవీథినిగాన్పించి మన ప్రస్తుతపుదైన్యస్థితికి కన్నీరుగార్చుమొగంబులతో నొకరివెనుక నొకరు చిత్రప్రదర్శనమునవలె బొడసూపుదురు. పుణ్యనదులగు గంగా సింధు కృష్ణాకావేరులు హైందవులయభివృద్ధికి మూలకందములై సర్వథా సంస్తూయమానములగుటచే వానినామములు హైందవసారస్వతములోనికి పెణుచుకొనియున్నవి. కావున జనసామాన్యమునకు ఐతిహ్యమును సామాన్యమే.

కాని మనకు ఆచారములు భిన్నములు, భాషలు అనేకములు. ఆచారములెట్లున్నను, ఈభిన్నబాషత మనకేకజాతిత్వమునకు ప్రతికూలమై సమష్టిజాతిత్వమే ఉచితముగా నొనర్చుచున్నది. భాషయనగా జాతికిప్రాణము. ప్రాణమువిడిచి దేహము బ్రతుకలేనట్లె భాషనువిడిచి జాతియును బ్రదుకలేదు. తల్లి ఉత్సంగమొకవంకయు హేమాద్రిని మఱియొకవంకయును జూపి, నీకేదికావలయునని శిశువునడిగిన అదిహేమాద్రిని నిరసించి మాతృోత్సంగమునే జేరుచున్నది. అట్లేసారస్వతరాజ్యోపభోగము నొకతల, త్రైలోక్యరాజ్యము నొకతల నుంచిన జాతి స్వాభావికముగానే సారస్వతమువైపునసే తిరుగును. ఆంగ్లేయుని నిర్బంధించి నీసామ్రాజ్యమునువిసర్జించెదవా? లేక 'షేక్స్పియరుమావాఁడుకాదని యొప్పుకొనెదవా'అనియడిగిన వాఁడేది చేయునది చెప్ప నక్కఱలేదు. ఒక్క షేక్స్పియరును పీడుటకే వాఁడింతకష్టపడునప్పుడు, అట్టివారిని వందలకొలది పోషింప శక్తిగలభాషను విడుచుట యెంతదుర్ఘటము? కావున జాతి భాషనువిడిచి బ్రదుకగలదన్నమాట అసంభవము. ఆంధ్రునకు

ఆంధ్రభాషవిడిచిపెట్టుటకంటె ఈయిండియాదేశమునకే కాదు, ఈలోకమునకుసైతము రాజీనామాయిచ్చుకొని పోవచ్చును.

మనకిప్పుడు ఆచారములు భిన్నభిన్నములుగా నున్నవి. కాని భిన్నములయ్యు వానియం దొకసామాన్యత గన్పట్టు చున్నది. మనయాచారములకును యూరోపియనుల ఆచారము లకును తారతమ్యముజూచిన, వానికంటె నివిభిన్నములై ముత్యాలహారమునందలి ముత్యములు వేరువేరయ్యు వాటిని గూర్చుసూత్రమొక్కటియే అగువిధమున సామాన్యాభిప్రాయ ము గలవియును, సామాన్యాదర్శముగలవియునుగా గన్పట్టును.

కావున మనకు ఏకజాతికి ప్రతికూలాంశములుగొన్నియు అనుకూలాంశములు గొన్నియు. ప్రతికూలములగు అంశము లుండుటచే మనకేకజాతీయత తలపరాని దనియు, అను కూలములు కొన్నిఉండుటచే సమష్టిజాతీయత గమ్యస్థాన మనియు యేర్పడుచున్నది.

ఇన్నిటికిని "ఏకజాతిత్వము ఒక్కదేశమువారికైనను గలదా?" అనువిషయ మించుకచర్చింతము. సమానదేహ లక్షణముగల వారొకజాతియనిన కేవలము సమరూపులగు పురుషులిద్దరు లోకములోనుండరనుట నిస్సంశయము. విశే షము పోలికగలవారియందును వారిని వేరువేరుగా గుర్తించు టకు దగినంతమాత్రము వ్యత్యాసముండనే యుండును. లోక మున సామాన్యముగా నట్లుండుటచేతనే వ్యవహారములు చక్కగ జరుగుచున్నవి. పశ్వాదులలోసయితము వ్యక్తిభేదము నిర్ణయించుట మనకు సుసాధ్యము. ఆపశువులకు మఱెంతసాధ్య

ముగాఁ గన్పట్టుచున్నది. వేయిగోత్రపిల్లలలో గలిసియున్నను గోత్ర తనశాబమును, శాబము తనతల్లిని క్షణములో పృథః కరించుచున్నవి. అది యట్లుండినను ఒకమానవసంఘమునకును, మఱియొక మానవసంఘమునకు నుండుభేదము సువ్యక్తము. చీనాదేశీయులను ఇండియాదేశీయులనుండి సులభముగ వేరు పఱుపవచ్చును. నీగ్రోలను ఇతరజాతులనుండి సులభముగా నేర్పఱుపనగును. ఒక్కజాతిలోనే రెండుమూడు తెగలున్న యెడల కొన్నిసమయముల నట్టితెగలను సులభముగ గుర్తింప వచ్చును. వ్యక్తిభేదమున్నను కొన్ని సామాన్యలక్షణములచే భిన్నరూపులగువారిని జాత్యంతరముగ శాస్త్రకారులు గ్రహింతురు. ఈవిచక్షణ స్థూలమైనదేగాని సూక్ష్మమైనదిగాదు. ఏదేశమునందుగాని కొంతయైన సంకరములేనిజాతి కన్పడకుండుటే ఈయభిప్రాయమునకు బలవదాధారము. జాత్యభిమానముచే విఱ్ఱవీగునాంగ్లేయులు ఆంగ్లోసాక్సను నార్మనుజాతుల కుద్భవించిన మిశ్రజాతివారే. దీనియందు పిక్టులయొక్కయు, ఐరిషు వారియొక్కయుసంకరము పూర్ణముగాఁగలదు. జర్మనులయందు స్లావులు మొదలగుజాతులు కలిసియున్నారు. ఈకాలపుగ్రీకుల కును పూర్వకాలపుగ్రీకులకును యెంతమాత్రము సంబంధమో స్పష్టముగా తెలిసియున్నది. చీనాదేశీయులకు జపానుసంకరమును రుష్యాసంకరమును గలవు. ఈకాలములో బ్రిటనుయందు సయితము చైనా జపానుదేశీయులుబోయి తెల్లవారిని వివాహమాడి సంకరముల నేర్పఱచుచున్నారు. తెల్లజాతిసంకరము మనదేశమున యూరేషియనులపేర ననేకతరగతులుగాఁ గన్పట్టు చున్నవి. ఈవిధమున నేదేశమునఁజూచినను కొద్దిభాగమైన

సంకరముగా గన్పట్టుచుండగా ఆదేశీయులకందఱికిని ఏకజాతిత్వ మెట్లుఘటిల్లును? శాస్త్రతః ఏకజాతిత్వము సమకూరదనుట నిస్సంశయము. ఐన నిదియాలోచింపుఁడు. తెల్లవడ్లలో నక్కడక్కడ కేశిపారుగింజలు గలిసియున్నను, వానిని తెల్లవడ్లనుట కేమిఆక్షేపణగలదు? మానవులు మనీషావంతులగుటచే బహుజాతిసమ్మిళితమగు సంఘమునందున్నైతము ఏకజాతిబుద్ధి ఆభిమానికముగఁ గల్పించుకొందురు. ఏకజాతిత్వము వస్తుతః అసాధ్యమగుటచేత ఏకజాతిబుద్ధి అర్థవిషయముల సమానదేశస్థులకు ప్రధానమగుటచేతను అట్టియభిమానము ఆవశ్యకమై యున్నది. ఒకదేశమునందు నివసించుజనులను అన్యదేశస్థుల వలన రక్షించుటకై ఐకమత్యము గల్గించుకొనుటకు వారందఱకు దేశసామాన్యతచేగల్గు నభిమానమునకు తోడు జాతిసామాన్యతచేగల్గు నభిమానముగూడ నత్యావశ్యకమై యున్నది.

హిందూదేశమందుగల అశేషజాతులకును ప్రభుత్వము ఒక్కటే యనునంశముగూడ వారికేకజాతిత్వము గూర్ప చాలదు. పూర్వము చంద్రగుప్తుఁడు, అక్బరు, కృష్ణదేవరాయులు పీష్వాలు మొదలైనవారి కాలములో భరతఖండములో విశేషభూమి ఒక్కప్రభుత్వముక్రింద నున్నను, ఈఏకజాతిత్వ మొంతమాత్రమును సమకూరలేదు. ఈప్రభుత్వము వారి యాధిపత్యములోను అంతకంటె నెక్కువకాఁజాలదు. ఎన్నివిధములను కృత్రిమసందర్భములు స్వాభావికశక్తులను నిర్మూలింపఁజాలవు. భాష జాతికి స్వాభావికశక్తి. అట్టిభాషాసత్త్వమును యాతాయాతనైజముగల ప్రభుత్వము నిర్మూలింపలేదు.

కాబట్టి హిందూదేశమునకు సమష్టిజాతిత్వమే యాదర్శము. ఆదర్శము దృష్టిముందునిల్పినపిమ్మట దానినిచేరుటకు సులభోపాయ మెద్దియని చర్చింపవలెను. ఈసందర్భమున అనేకులు హైందవసంయుక్తరాష్ట్రములనుగుఱించి ముచ్చటించియున్నారు. కాని ఆయాదర్శముపొందు మార్గమువిషయమై అందరికినొక్కయభిప్రాయములేదు. ఆయంశము నించుకైనను ఆలోచించినవారెల్ల, భాషానిర్ణీతరాష్ట్రములే మనహైందవజాతీయతకు అంగములు కాఁగలవని దూరదృష్టిని చూచియున్నారు. స్వార్థపరాయణులు, తాత్కాలికలాభమును గోరువారును కాలక్రమమున తమ కేది శ్రేయోదాయకమని గుర్తెఱుంగలేనివారును కొందరు దీనినిఖండించిరి. శత్రుపక్షము వారిట్లు చెప్పుటసరియేగదా, మనవారుసైతము కొందఱిది సరియైన యాదర్శముగాదనియు, ఒకవేళ విధిలేకదానినొప్పుకొనవలసి[1] వచ్చినప్పుడు ఆంధ్రు లొకజాతివారుకాదనియు చెప్పుదురు. పైవాదముచేత మనకు సమష్టిజాతిత్వమేఆదర్శమనియు, అద్దానికి భాషానిర్ణీతరాష్ట్రములే అంగములనియు విశదమైయుండును. ఇక నిపుడు ఆంధ్రులొకజాతివారా కాదా అనువిషయమును చర్చింపవలెను. అసందర్భమున చారిత్రాత్మకమైన దృష్టాంతములఁజూప మేము బూనుకొనలేదు. ఆంధ్రులలో కొందఱు రాష్ట్రము ప్రత్యేకముగాకోరుచుండ వారి యవివేకతకు విచారపడి 'ఓహో! సోదరులారా! మీరు చెడిపోవుచున్నారు, మనకు ద్రవిడులతోపొత్తు ఎంత శ్రేయోదాయకమైనది మీరు

[1] 1917 నెల్లూరియందుజరిగిన రాష్ట్రప్రతివాదులసభలో నొకరిట్లు చెప్పిరి.

కనుగొనలేకున్నారు' అని వారిదు కుయ్యాలించినవారెల్లరును వీరందఱును ఒకేజాతివారని చెప్పకమానరు. అట్టివారి విచారమే ఆంధ్రులొకజాతియని చెప్పక చెప్పినది. చేతనవ్యక్తి యందుగల అంగాంగసంబంధ మి[1]ట్టిదేకదా? వియోగము సహింపలేని ఈ సంబంధమే చేతనవ్యక్తియొక్క చైతన్యమును చాటుచున్నది. కాలిలో ముల్లుగ్రుచ్చుకొనినచో చేతులూరకుండ జాలవుగదా! అట్లే కంటికి దెబ్బదగిలినపుడు దేహము వేదనబొందును. ఈసంబంధము ప్రకటీభూతమగు వఱకును వ్యక్తి ఆరోగ్యముతో మెలగు చేతననుగుచున్నది. ఆంధ్రజాతియు నట్లే. కాబట్టి అట్లువిచారపడిన వారే చేతజేయుచు, వాచాలేదనుచున్నారు.

దీనియందు మఱియొక ప్రమాదముగలదు. అట్లు వారొనరించు కార్యముయొక్క ఫల మించుకాలోచింపవలెను. అంతశ్చేతనులు కానివారితో మీ రించుకమాత్రులని చెప్పుట చాల పొఱబాటని మానసికశాస్త్ర ముద్ఘోషించుచున్నది. వ్యక్తివిలసనము సంపూర్ణముగా లేనివాఁడుగాని, వ్యక్తివిలసనము సంపూర్ణముగానుండినను స్వబుద్ధిచే నంగీకరించు వాఁడుగాని ఆరోపణవిద్యా[2] ప్రయోగమునకు సులభుఁడని ఆశాస్త్రవేత్తలు చెప్పుదురు. ప్రత్యేకవ్యక్తి కెయ్యదిశాస్త్రమో, సమష్టివ్యక్తికి నయ్యదియే శాస్త్రము. జాతియందు సంపూర్ణవ్యక్తిజ్ఞానము లేనపుడు దానియందు దుర్మోహారోపణము[3] చేయరాదు. వ్యక్తిజ్ఞానము లేనివారలతో 'మీకుజాతిలేదు. ఐతిహ్యములేద'ని చెప్పుట జాతివ్యక్తిభ్రంశమునకు కారణము. కావున

1. Organic relation.
2. Suggestion—Hypnotic suggestion.
3. Evil Hynotie suggestion.

వాదములేనపుడు 'మాకువాదములేదు. ఐనను మామతము విడువుము'ని చెప్పుట మేలుగాని, ఇట్లు దుర్మోహారోపణ సేయుట యవివేకము.

సమష్టిజాతిత్వమునకు జాతులే అంగములు. ఏలననగా చేతనమగుసమష్టిజాతికి అంతర్భాగములునైతము చేతనములుగానుండవలెను. అనగా అంగములుగా నుండవలెను. అంగమనగానేమి? చేతనవ్యక్తియం దొకభాగమై, తదితరభాగములకంటెభిన్నమైన ప్రత్యేకస్వరూపముగలిగి, తనయంతర్భాగములకు నంగాంగసంబంధముగలిగి, ప్రత్యేకస్థానమును, ప్రత్యేకధర్మమునుగలిగిన యొకఅంతర్వ్యక్తి. ఈఐదింటిలో నెయ్యది కొఱతయైనను వస్తువు అంగముకానేరదు. చేతనవ్యక్తియందొకభాగముకాక తక్కిననాల్గుధర్మములును గలిగియుండినచో నయ్యది ప్రత్యేకవ్యక్తియే యగును. అంగముకానేరదు. ప్రత్యేకస్వరూపమును స్థానమునులేనిచో ప్రత్యేకధర్మమును నిర్వర్తించుటకు వీలులేకపోవును. అంగాంగసంబంధములేనిచో చేతనము కానేరదు. కాబట్టి చేతనవ్యక్తిలో భాగముకానేరదు. ప్రత్యేకధర్మములేనియెడల దానియునికి నిరర్థకము. కావున అంగమునకీయైదులక్షణము లుండవలెను. సమష్టిజాతియగు మనహైందవజాతిని మతేవిధమైన అంతర్భాగములుగా విభజించినను పైలక్షణములలో నొకటేని కాక రెండేని కొఱవయగును. ప్రస్తుతము దక్షిణదేశముననుండునట్లు ఆంధ్రద్రవిడులసమ్మేళనముచే అంగలక్షణములలో మూడు లుప్తములగుచున్నవి. అవియేవన ప్రత్యేకస్వరూపము మొదటిది. ఆంధ్రవ్యక్తియొకటి అరవవ్యక్తియొకటి కలియుటచే నీసమాజమున

కాక వ్యక్తియున్నదనుటకు వీలులేదు. కాన ఈసమ్మేళనము వాస్తవముగా సమ్మేళనముకాక సంకరమై ఉభయపక్షముల వారికి నేనగింతపాడమున కొల్లానర్చును. ఇరుగడలవారికిని అప కారిణియగు నీసంకరముచే దీనియందు అంగాంగసంబంధము సంపూర్ణముగా నుండఁజాలదు. ఈసంబంధముకొఱవడినకారణమునను ప్రత్యేకస్వరూపము లేమిచేతను ఈరాజ్యమువారు ప్రత్యేకధర్మమును నిర్వర్తింపలేకపోదురు. ప్రత్యేకధర్మము చేయుటకు పైజెప్పినరెండును ముఖ్యాంశములు. అవిలేనినాడు నిదియు నుండఁజాలదు. అందుచే నీసంకరము అంగమునకు ఆవశ్యకమైన మూడులక్షణములను చంపుచున్నది. పైమైడు లక్షణములలో నేదేనిఒక్కటి లేకపోయినచో నయ్యది అంగము కానేరదని చెప్పియుంటిమి. అట్లుండ మూడు కొఱవడినయైన నీసంకరమును నేమననలెనో తెలియకున్నది. ప్రత్యేకవ్యక్తులు గల రెండుఅంగములను కలిపి ఆయోజనముచే రెంటియందును అంగత్వమునుజంపి రెంటిని నిర్జీవముగాజేసిన చేతనమగు నీహైందవవ్యక్తి కెంతన్యూనత గల్గుచున్నదో చూడుఁడు. దేహమునందెవ్వియేని రెండుఅంగములు పక్షవాయువు దగిలి నిష్ప్రయోజనములైనట్లే. రెంటిని దెగనఱుకుదమన్న సాధ్యముగాదు. అట్లే నిలుపుదమన్న వృథాభారము. వృథాభారము మాత్రమైన నోర్చుకొని యుండనగునుగాని నీనియుని కిచే దేహమురోగావిష్టమైనదని అనుక్షణమునువచ్చు జ్ఞాపకము ఇతరఅంగములనుగూడ స్వధర్మపరాఙ్ముఖములుగజేసి కొంచెముకొంచెముగా తుదకు వ్యక్తిని సంపూర్ణముగఁ జంపును. హైందవజాతివ్యక్తికిని ఇట్టియసంభావ్యపు విభజనలచే దురవస్థ

యేరాఁగలదు. కావుననే మనకు భాషానిర్ణీత రాష్ట్రములే ఆదర్శములని వక్కాణింపవలెను.

చేతనమునకంగమైన ఒకఅంతర్భాగమునకు తాను ఆచేతనముతో నొక్కటియను సమష్టిజ్ఞానమునకుదోడు స్వధర్మజ్ఞానము సంపూర్ణముగనుండుటయేకాక, స్వధర్మమును పాలించుటకు ఆవశ్యకమైన సంపూర్ణశక్తియు నుండవలెను. హైందవవ్యక్తి కంగమగు ఆంధ్రజాతికిని అట్లే. లేనినాడు స్వధర్మపాలనము దుస్సాధ్యమగును. అట్లు సంపూర్ణవ్యక్తిజ్ఞానమును, స్వధర్మపాలనాశక్తియును సంపాదించుట కొఱకై ఆంధ్రులు వేరురాష్ట్రమును కోరునది. ప్రత్యేకరాష్ట్రమందైనచో జాతీయవ్యక్తిని సులభముగా నెలకొల్పనగును. (సంకర) రాజ్యమందీకార్యము కొనసాగదు. జాతీయవ్యక్తి ఆయాజాతులవారి మనస్తత్త్వమునుబట్టి వృద్ధిబొందును. జాతీయమార్గముల ననుసరించియే నయ్యది పెంపొందును. పొగబండిని రైలువీధిపై నిలిపి ప్రేరేపించిన ఆకమ్ములనే అనుసరించి అదిగమ్యస్థానముచేరురీతిగనే జాత్యుత్సాహము జాతీయమార్గములననుసరించునట్లు ప్రేరేపించినచో జాతీయవ్యక్తిని పెంపొందించుకొనుచు గమ్యస్థానముచేరును. రైలుబండి కమ్ములను తప్పిన నేలగూలి శకలములగునట్లే జాత్యుత్సాహమును జాతీయమార్గములను విడిచిన జాతిభ్రంశమునకు హేతువగును. ఇయ్యది నిజపంథానుసరణమున అంతరాయమును సహింపదు. అన్యజాతివ్యక్తిసంపర్కముచే నదిజాతీయమార్గముల ననుసరింపలేక వ్యగ్రమై లక్ష్యముగానలేకపోవును. లేదా, మాత్స్య

న్యాయమున[1] నావ్యక్తికి చోటిచ్చి తాను స్వరూపనాశము నొందును. ఇట్లు రాఁగలజాతీయవ్యక్తివిసర్జనయు, అన్యవ్యక్త్యవలంబనమును జాతివినాశన మాపాదించును. నిజమతసంస్కార మభివృద్ధికి మూలమేగాని, అన్యమతస్వీకారము జాతిప్రళయసూచకము. అయ్యది మానవసమష్టివ్యక్తిని మూలముట్టద్రవ్వును. కీళ్లుకీళ్లుసడల్చి ప్రచలనము సాధ్యము కానట్లు చేయును. అందుచే జాతియందు కట్టుబాటులేక జాతి లయించును. అన్నిభాగములును సరిగానుండిన పనిచేయు యంత్రమందు కొన్నిభాగములు తమరూపముగాని, స్థానముగాని, వ్యాపారములనుగాని మార్చినచో ఆయంత్రమెట్లు పనిచేయును? చతుష్పాత్తులనుజూచి నాల్గుకాళ్లుండుటచే మృగములు ప్రాయికముగా పడుటలేదు అనుసద్దేశముతో మానవుని దేహమందుఁగల చేతులుసయితము నడచుటకు ప్రారంభించిన, నాఁడుచేయు పనులెట్లు కొనసాగును? కావలెనన్న సాధ్యమైనచో ప్రయత్నమున మఱిరెండు కాళ్ళుసంపాదించుటగాని, లేక ప్రస్తుతముండు పాదములు పెద్దవిగాచేయుటగాని యుచితముగాని, చేతులను కాళ్లుగామార్చుట పొఱబాటు. అదేరీతిగ మానవసమష్టివ్యక్తియందు నిజమతసంస్కార మొప్పునుగాని, అన్యమతావలంబనము కూడనికార్యము. చేటుగూర్చును. కావుననే మహర్షులు "పరధర్మోభయావహః" అని చెప్పియున్నారు. మతమునకట్లో జాతీయవ్యక్తికిని అట్లే. వ్యక్తిపరివర్తనము జాతీయసంస్థితికి మూలచ్ఛేదకరము. కావున ప్రయత్నమున జాతీయవ్యక్తిని

---

1. Survival of the fittest in the struggle for existance—Natural selection: The bigger fish eating the small.

పోషింపవలెను. దానికంతరాయమును గల్పించు అంశముల నెల్ల మిక్కిలి జాగ్రతతో తొలగద్రోయవలెను. అందువలననే మన జాత్యభివృద్ధికై మనము ద్రవిడులును వీడఁగోరుట, వారి యభివృద్ధికై నుమ్ముపాయమని వారిని ప్రార్థించుట.

ఆత్మజ్ఞానమునకై పాటుపడు యోగీశ్వరు లేమిచేయుచున్నారు? ఆత్మ సర్వవ్యాపియనియు, దానికంటె వేరైనది లేదనియు గురుముఖముగా నెఱిగియు, అనుభవరీత్యా తెలిసికొనుటకై, ఆత్మయేదని విచారించుచు 'ఇదియా? అదియా?' అని ప్రశ్నించి, 'నేతి నేతి' అని దృశ్యప్రపంచమునంగల వస్తువుల నెల్ల పరిత్యజించి తుదకేదియుఁగానక యోగసమాధియందవ్యగ్రమస్కులై కూర్చుండి ఆత్మంగని, సంపూర్ణముగ దాని స్వరూపము నెఱిఁగి సమాధినుండి జ్ఞానసత్వముతో వెలువడి ఆత్మ సర్వవ్యాపియనియు, తానే సర్వమనియు నెఱిఁగి, భూతహితమే తనహితముగా నిర్ణయించి లోకహితార్థమే జీవించుట లేదా? అట్లే ఆంధ్రజాతియు తనవ్యక్తిస్వరూపమును, సంపూర్ణశక్తిని అనుభవము చేనెఱుఁగఁగోరి "మేము ద్రవిడులము కాము, మేము కర్ణాటులు కాము" అని వారిసందరినుండి తాత్కాలికముగా వేర్పడగోరుట. యోగి ఆత్మజ్ఞానముగలిగిన వెనుక సమాధినుండి వెలువడి లోకక్షేమమునకై జీవించునట్లే, ఆంధ్రులును జాతిజ్ఞానమును జాతిసమాధిచే సంపాదించిన వెనుక అరవలక్షేమమే కర్ణాటులక్షేమమే తమదని తెలిసి వారిహితమును సయితము తలపెట్టి తదర్థము తమప్రాణముల నర్పింపఁగలరు. ఆత్మజ్ఞానసమార్జనకు సమాధియొక్కటియే మార్గమని వేదాంతశాస్త్రజ్ఞులు చెప్పుటలేదా? ప్రత్యేకవ్యక్తికి ఆత్మజ్ఞానసమార్జనమునకె య్యది

శాస్త్రమో, యేప్రక్రియయో, సమష్టివ్యక్తికిని అదేశాస్త్రము, అదేప్రక్రియ. కావున పైనవ్రాసినదంతయు కావ్యమును, అలంకారమును కాదు. శాస్త్రము. దీనంజేసియే ఆంధ్రులు ఇతరజాతులనుండి వేర్పడి జాతిసమాధియందు గూర్చుండవలెను. అట్లే ద్రవిడులును, అట్లేకర్నాటులును. అట్లు జేసినగాని ఆయాజాతులవారికి వారివారిజాతిసత్త్వము సంపూర్ణముగ తెలియఁజాలదు.

అంగసంస్థానమునంగల అంగములకు ఆత్మజ్ఞానముఁగలిగి ఆత్మసత్త్వము సంపూర్ణవిలసనమునొంది, అన్యోన్యావశ్యకత అనుభవపూర్వముగ మనస్సుననాటినగాని ఆయంగసంస్థానము సజీవముకానేరదు. సజీవమగువఱకును అంగసంస్థానమునంగల అంగముల సన్నిహితవ్యవస్థ పరస్పరావరోధకమై రాపిడిచే కలహాగ్నుల ప్రజ్వలింపజేయును. మానవశరీరము సజీవముగానుండునపుడు, కాలిక్షేమము నోరును, నోటిక్షేమము కాలును గోరుచు అన్యోన్యానుకూలతమై ప్రవర్తించు ఈయంగసంస్థానమే, శరీరము నిర్జీవమై శుష్కించిన పిమ్మట అంగములొకటితో నొకటికొట్టికొని ఆసంఘర్షణముచే కాలక్రమమున సశల్యముగా జీర్ణించిపోవును. కావున నిర్జీవమైన దేహమునందు అంగాంగసన్నికర్షము ప్రళయమునకును, సజీవమైనదేహమందదే అంగాంగసన్నికర్షము పరస్పరాకర్షణమునకును, ప్రేమానుబంధమునకును, ఐకమత్యమునకును హేతువు. కాబట్టి యే ఐకమత్యమునకు అంగాంగసన్నికర్షము చాలదు. అంగసముదాయమునకు జీవముకూర్పడియెడల అట్టిసాన్నిధ్యము చేటుదెచ్చును. అంగాంగపరస్పరావశ్యకత మనమున అనుభవపూర్వముగా నాటినగాని

అంగసంస్థానము సజీవముకానేరదనియు, అట్లు నాటుటకు సంపూర్ణమైన ఆత్మజ్ఞానమలవడవలెననియు ఆత్మజ్ఞానమలవడుటకు సమాధియే మార్గమనియు పైనజెప్పియుంటిమి. కాబట్టి, మన యరవసోదరులును, కర్ణాటసోదరులు, మనమును నిజమైన ఐకమత్యముగలిగి మనవ్యాపారములయందు సజీవముగాను, వివేకముతోడను వర్తింపవలెనన్న నీమూడుజాతులవారును అన్యోన్యమువీడి జాతిసమాధిచే ఆత్మసత్వములను, ఆత్మధర్మములను ఎఱుంగవలెను. అటుపిమ్మట ఐకమత్యముసాధ్యపడునే గాని ఇప్పటి మన సన్నిహితవ్యవస్థయు, యాదృచ్ఛికసంయోజనమును అన్యోన్యవైషమ్యములకును, జాతిపరస్పరహింసలకును మనల నీడ్చుకొనిపోవుచున్నది. అన్నిపక్షములవారికిని క్షేమకరంబగు నీవిభజనమూలమున ఈజాతులవారికి పరస్పరస్నేహభావము పెరుగఁగలదు.

మఱియొకవిశేషము. జాతీయాభివృద్ధి జాతీయమార్గములనే సమకూరవలెనుగాని అన్యజాతిమార్గముల కాదని చెప్పియుంటిమి. అన్యజాతిమార్గములు, అన్యజాతిమనస్సరణియు అవలంబింపబడి భాషావ్యక్తిని జాతివ్యక్తిని వినాశనమొందించును. అన్యజాతిమార్గములు అన్యభాషాభ్యసనముచే ప్రాపితములగును. ఈసందర్భమున అన్యభాషావలంబనముచేఁగలుగు లాభనష్టములను సంపూర్ణముగమనస్సునకు దెచ్చుకొనవలెను. అన్యభాషాగ్రహణము కొన్నిసమయములం దుపకారియేగాని మఱికొన్నిటిలో వారింపరాని ముప్పును దెచ్చిపెట్టుచున్నది. అయ్యది భాషాభ్యసనము చేయువారి మన స్తత్వము ననుసరించి యుండును. పులిపిల్లను కన్నెఱుగక పూర్వమే దెచ్చి గొర్లతో బెంచినపిఱికి

యగుచున్నది. స్వజాతిజ్ఞాన మలవడినవెనుక దానిందెచ్చి గొర్ల తోడనే బెంచిన దినమునకొక గొఱ్ఱెను భక్షించి స్వజాతివ్యక్తిని మఱింతబలపఱచుకొనును. అట్లే జాత్యభిమాన మంకురింపక పూర్వమే ఒకపసికూనను అన్యభాషయందు ప్రవేశపెట్టినచో వాఁడు స్వజాతివ్యక్తిగోలుపోయి, అన్యజాతి ధర్మమును స్వీకరించి పుట్టువుచే స్వజాతీయుఁడైనను వేషభాషలచేతను కార్యవ్యాపారములచేతను విజాతీయుఁ డగుచున్నాఁడు. అట్టివాఁడు కాళిదాసు చెప్పినట్లు "వర్ణమాత్రేణకృష్ణః" వర్ణముచేత నైనల్లని వాఁడు. అన్యతః పరదేశీయుఁడే. వానిమనస్సరణియును మారిపోవును. అన్యజాతిపద్ధతులయందు గౌరవము హెచ్చును హెచ్చను స్వజాతిమార్గములయందును ధర్మములయందును ఏవగింత వొడమును. యుక్తియుక్తములగు విషయములయందు ఈవైపరీత్యములు గాననగుట సరిమేగదా, అట్లుగానిపట్ల సయితము ఈస్వజాతి సంప్రదాయవైముఖ్యము సువ్యక్తమగుచున్నది. ఇయ్యది నేటిఆంగ్ల విద్యోపనీతులయెడ మెండుగగన్పట్టును. వీరిలో నుత్కృష్టులు లేరని మాయాశయముగాదు. కాని ఆంగ్లభాషాధిగములలో విశేషభాగము స్వజాతివ్యక్తిని గోలుపోయినవారే. వారిమనస్తత్వ మెట్లుమారినది ఈచిన్నసందర్భములలో తెలియఁగలదు. ఏడవసంఖ్యను వర్జించుట వారికి మిక్కిలి పరిహాసాస్పదముగా నుండునుగాని, పదమూడవసంఖ్య (The unfortunate number) ను వర్జింపకపోయిన వారికి గౌరవహానియు, నాగరకతకు లోపమును. ఆదివారములయందు పనిపాటలు చేయకుండుట సుబోధ్యమేకాని, చతుర్దశి అమావాస్యలయందు శెలవిడుటకు కారణములు దురూహ్యములు.

ఆదినుండియు విజాతివిద్యనారంభించినవారి దుర్నీతి వర్ణించుట కడుంగడుందుఃఖకరము. తమపెద్దలమర్యాదలు, వారిజ్ఞానము వారిచరిత్ర వీరికెంతమాత్రమును దెలియదు. వారునేర్చుకొను జ్ఞాన మన్యదేశీయులదే. వారికిదెలిసినజ్ఞానులు, కవులు, విద్వాంసులు అన్యదేశీయులే. ప్రస్తాపనవశమున వారుప్రయోగించు చమత్కారవాక్యము లన్యదేశీయములే. వారిహృదయమున కెక్కినవి అన్యదేశీయపద్ధతులే. నిరంతరసాంగత్యముచే వారి హృదయమందు జనించు విద్యావిషయికమగు నభిమానమంతయు అన్యదేశీయులయందే. ఈచిన్న సందర్భమునుం జూడుఁడు. మనదేశమందు గణుతికెక్కినట్టియు, సర్వశాస్త్ర పారంధృశ్వినులగునట్టియు సంస్కృత పండితులెందఱోయుండ ఐరోపాదేశమున "యత్రవిద్వజ్జనోనాస్తి। పూజ్యస్తత్రాల్ప ధీరపి। నిరస్తపాదపేదేశే। హేరండోపిద్రుమాయతే" అన్నట్లు మేకపోతు గాంభీర్యముదాల్చి సంస్కృతమును ఆంగ్లేయ జర్మనుభాషలలో వ్యాఖ్యానము చెప్పునట్టి 'యూరోపియన్ స్కాలర్స్'వద్ద మనవారికి సంస్కృతమందు యోగ్యతాపత్రములు కావలసివచ్చినది. క్రొత్తయొకవింత ప్రాతయొకరోత గదా! ఈదేశపువిద్యలు మిథ్యలు. వాల్మీకివ్యాసకాళిదాసాది కవులు మనదేశములోనుండిన సంగతియే వారికితెలియదు. అథవా తెలిసినను'కాళిదాసా is the Shakspeare of India' అని (Shakspeare) షేక్స్పియర్కు రొమ్ములవఱకువచ్చునా, బుజములవఱకువచ్చునా? అనిసరిజూచినగాని కాళిదాసుని నాటకకళావైదుష్యమును, అలంకారసామమార్యమును వీరికి మనోగోచరముకాదు. తృప్తియునులేదు. (Telegue is the Italian

of the East.) అనిచెప్పినంతవఱకును వారికి తెలుగుభాష గొప్పదనము భావవీధిఁ గన్పట్టదు. మనవస్తువులలో నేదాని యొక్క అంతస్సారము కనుగొనవలెనన్నను యూరోపులో దానికి సరియైనదానిని మానముగాఁగొని దానితోఁబోల్చిచూచిన గాని వారికి దానివెల తెలియదు. మఱియు, అజ్ఞాతనాముఁడగు బిమొవుల్ఫ్ అనువాఁడు వ్రాసినక్షుద్రకావ్యము రామాయణ మహాభారతములకంటె స్తుతిపాత్రము. ఘాసరువ్రాసినచిట్టెలుక కోడిపుంజుకథలు కథాసరిత్సాగరముకంటె ప్రీతిపాత్రములు. దేవాలయములు నింద్యములు. అచట నటవిటగాయకులు చేరు దురు. చర్చిస్ శ్రేష్టములు. అచ్చట మ్యూసిషన్స్, లవర్స్ డాన్సర్స్ చేరుదురుగదా! సౌందర్యసారము ఈదేశస్థులకు బాగుగా తెలియదు. సౌందర్యశాస్త్రము వీరభ్యసించియుండ లేదు. వీనిలో నేదైన బాగుగనున్నదని యూరోపియను డెవ్వ డైనఁ బల్కినయెడల నదిమాత్రము గౌరవనీయము. ఇచ్చట నుండు గొప్పవిషయములు వారు కనిపెట్టవలయును. గొప్ప వారిని వారంగీకరింపవలయును. తనతండ్రి ప్రతిదినము వేద మంత్రములు పఠించుచుండినను, బాలుఁడు "Max Muller discovered the Veda" అనువాక్యమును వల్లెవేయు చుండవలయును. ఆవేదమునకు మనకు నెంతదూరమో! దానిం గనిపెట్టుటకెంత శ్రమపడవలయునో! ఎంత మహోపకారి యీ Max Muller?

స్వజాత్యౌన్నత్యమునందును, స్వదేశగౌరవమునందును విస్మృతిమాత్రముగలిగిన కొంతమేలు. ప్రస్తుతము మనదేశము నకు మహోపకారముచేయుటకువచ్చిన మిషనరీలు, వారిమత

ష్ఠులును, వారితో సమానవిద్యావంతులగు ప్రభుత్వమువారును స్వస్వలాభమునుగోరువారై ఈ దేశీయుల కాంగ్లభాషగఱపుటకు సమకట్టినవెనుక దేశమునంగలిగిన యనర్థము లపారములు. స్వజాతిద్వేషము, స్వమతగర్హణము, స్వభాషానిరసనము, స్వవేష వైషమ్యము, స్వబుద్ధిపారతంత్ర్యము, స్వధైర్యత్యాగము స్వత్వనాశమును సంభవించినవి. ఉగ్గుపాలుద్రావుకాలము మొదలుకొని ఇంగ్లీషుపుస్తకములును, వారిచేనియమింపబడిన తెనుగుపుస్తకములును చదువుబాలురకు, దురభిప్రాయములు శిలాంకురములై వారిమనంబులనిలుచును. దినదినము ఉపాధ్యాయులు మనపెద్దవారి మూర్ఖత్వమునుగుఱించి, వారిఛాందసమునుగుఱించియు నుపన్యసింపుచుందురు. మిషనరీపాఠశాలలయందు బైబిలుసయితము చదవింతురు. ఇంతకన్న జాతిహత్యవేఱుగలదా? అన్యమతయోధులగు మిషరీవీరులు తమకుసమానులై వేదాంతశాస్త్రవేత్తలగుపండితులతో మతయుద్ధముఁజరిగింపవలయునా? లేక చెప్పినదెల్ల నమ్ము బాలురతో తమయకృత్యము బూనవలయునా? తనదేహబలమునిరూపించుటకై మనగ్రామమునకువచ్చినమల్లవీరుఁడు మనగ్రామమున మల్లురెవ్వరైనగలరాయని విచారించును. ఎవరైననున్నవారిని లడాయికి పిలుచును. లేనిచో యుద్ధేష్టముగాజనును. కానిగ్రామబాలురతో తనబాహుబలమునకుం బనిబెట్టునా? దేహబలవిషయమునంగల న్యాయము బుద్ధిబలవిషయమునం జెల్లదా? అదియేమికర్మమో, క్రిస్టియనుమిషనరీలవిషయమున చెల్లదు. పూర్వము మనదేశమున మతస్థాపకులగుశంకరుఁడు మొదలగువారు దిగ్విజయముచేసినపుడు అనేకనగరములకుంబోయి మండన

మిశ్రాదులతో వాగ్యుద్ధము బెట్టుకొని వారినిజయించిరికాని గ్రామబాలురకు బైబిలు చెప్పలేదు. ఇపుడుక్రిస్టియనుమిషనరీలు అటుకాదు. ఎక్కడవిద్వాంసులు లేరో అదివారి కుత్తమస్థలము. ఎవరువిద్యాహీనులో వారుమతబోధకర్హులు. ఇట్టివారి వర్తనమునంగల జ్ఞానభీరుత్వము మిక్కిలగర్హ్యముగదా! అయినను వీరుమనబాలుర కుగ్గుపాలతో పోసిన విదేశభావములు మనదేశీయసంస్థితికి వేరుపురుగులై తొలుచుచున్నది. మనది అనిన దేదైనను మనవారికిపుడు కంటగించుచున్నది. స్వదేశి తత్వమును చర్చించువారి భారతీయులలో నగ్రగణ్యుడగు ఆనంద. కె. కుమారస్వామిగారిట్లు వ్రాయుచున్నారు 'ఆంగ్లవిద్యాధికులము నుకొను మనమే, మహాసభల నలంకరించుమనమే, అనుశాసనిక సభల జోక్యముపుచ్చుకొను మనమే, జమీనులనేలు మనమే, న్యాయస్థానముల నధికవరుమానములనార్జించు మనమే, అకారణముగ హైందవమైనప్రతిదానిని ద్వేషించి గర్హించుచున్నారము. ఇట్టిద్వేషముచేతనే మనము హైందవశిల్పుల నధఃపతితులగాఁజేసితిమి. తప్పుమనయందుండెనని మనము తెలియనేరక పోతిమి. ఆంగ్లేయవాస్తుశాస్త్రమునకనుసరించి కట్టినగృహములలో తప్ప నివసింపక పోతిమి. నవనాగరకతయని మెడపట్టలును (Collers) మెడకుచ్చులును (Neckties) ధరించితిమి. కలెక్టర్ల బంగళాలదర్వాజలలో కూర్చుండుట గౌరవమని భావించి అట్లొనర్చితిమి. కుర్చీలపై గూర్చుండి చంచాలతో భుజించుట నేర్చితిమి.' ఇంక నాగరకత, అభివృద్ధిపేరుబెట్టి ఎన్నియో అసంభావ్యపు కార్యముల నొనర్చితిమి. ఇవన్నియు దేనిఫలములు? స్వజాతి వ్యక్తిజ్ఞానము కుదరకమునుపే అన్యభావనుపరించుటచేతనే

యనక తప్పదు. నిజజాతీయతత్త్వము బోధపడినవెనుక అన్యభాషాపరిచయము పరిజ్ఞానమునకు మెఱుఁగిడునేగాని, దత్పూర్వము జాతీయపరిజ్ఞానాంకురములను మొదలంట గిల్లి వేయును. కావున ప్రతిమనుజునకును జాతీయవ్యక్తిజ్ఞానమలవడు నఱకును దేశభాషయే కఱపవలెను. పిమ్మటనైచ్ఛికముగాను, ఆభిమానికముగాను విదేశభాషలనేర్పినను వ్యక్తిస్వాస్థ్యమునకు సంకటము గలుగనేరదు. లాభమునుచేకూరును. ఇదియే భాషాభ్యసన తత్త్వము.

ఇందొకరహస్యము గలదు. అభ్యసింపబడుభాష రాజభాషయైనచో నందలిముప్పు మెండు. రాజ్యకార్యనిర్వహణమునకై రాజులు తమభాషయందు నిపుణులైనవారికి ఉన్నతోద్యోగములొసంగి గౌరవించి, బిరుదులొసగుచుండ స్వదేశభాషాపండితులు నిరుత్సాహులై కాలక్రమమున భాషాభిమానమును బోవిడుతురు. రాజభాషయన్నంతమాత్రముననే, రాజనామసమ్మోహమున దానియందాదరము జనించుచున్నది. అట్టి ఆదరమునకుఁ దోడు, రాజభాషాపండితులు బహుమానములు బడయ ఆయాదరముగౌరవమై,రాజభాషయొకదేవభాషయనియు, దేశభాషప్రాకృతుల భాషయనియు, దేశభాషాపండితులు మనుష్యమాత్రులైయుండ రాజభాషాపండితులు అతిమనుజులనియు, భ్రమయొకటి కలుగుచున్నది. ఇట్టిభ్రమకు కేవలము దుర్మోహమేకారణము. జనసామాన్యమునం దీదుర్మోహము గలుగుటయు, ఉగ్గుపాలతోటి పరభాష నేర్చుటచే జాతిస్వభావమెఱుఁగక నేరక, జాతియందుస్నేహార్ద్రహృదయులుకాజాలక,

అన్యాదర్శములస్వీకరించి, అన్యమార్గావలంబులై అన్యదేశీయ తుల్యులగు నీరాజభృతకులు, ముత్యపుచిప్పలన్నియు నొక్క-చోటను, నత్తగుల్లలన్నియు నొక్క-చోటన న్నట్లు, ఒక్కడ జేరి అధికారరోగపూరితులగుట, జనసామాన్యమును తృణీకరించి నిరసనభావముతోజూచి తమ్ముగౌరవించుకొనుటయు, రాజభాషాభిజ్ఞులకును, తదితరులకును, అత్యంతఅంతర మేర్పడుచున్నది. ఇట్లు కేవలము కృత్రిమమై, దుర్మోహమాత్రమున నేర్పడిన ఈ యంతరముచే ప్రాధాన్యమునను భవించు విదేశభాషాపండితులు తమ్ములగుఱించి నాగరకులనియు, జనసామాన్యమును గుఱించి మూఢులనియు, ప్రాకృతులనియు ప్రవర్తనముచేతను, సంభావణలచేతను, దుర్విచేష్టలచేతను వాడుకొనుటచే అశక్తులును, అధికారవిహీనులును, నిరుత్సాహులునగుజనులు తమ్ము మూఢులనియేనమ్మి మఱింతనుర్మోహమునకు లోబడుదురు. ఈ దుర్మోహప్రభావమున, భ్రమరకీటన్యాయమున జనులు వాస్తవముగా మూఢులగుదురు. అప్రయోజకులును, కార్యమునందసమర్థులును అయ్యెదరు. ఇట్టిదుర్మోహమునుగుఱించి యెంతజెప్పినను దానిప్రభావము మనోగోచరముగుట దుస్సాధ్యము. దానినిగొంత వివరించెదము. పాఠకమహాశయులు విషయాంతరాత్రికమణము సహింతురుగాక.

మానవునకుంగల యజ్ఞానమే మోహమనిపించుకొనును గదా? తానెంతయో తనబలమెంతయో యథార్థముగా నెఱుగుట జ్ఞానము. విపరీత మజ్ఞానము, లేక మోహము. తాను వినుమాటలంబట్టియు, ఇతరులబోధలంబట్టియు ప్రతిమానవునికిని.

స్వవిషయమునగాని, పరవిషయమునగాని కొంత యజ్ఞానముండ నేయుండును. ఆర్థిక[1]విషయమునశక్తిత్రయములో ప్రధానమగు నుత్సాహశక్తికి సజాతీయములగు ధైర్యస్థైర్యశౌర్యాది గుణములు మనస్తత్వసంబంధులుగావున నీపక్షమున స్వాతిశయ భావము, పరబలతృణీకరణము ననురాజసగుణజన్యములైనభావ విశేషపోషకమగు నాత్మోత్కృష్టతా బుద్ధి గలిగియుండుట సమ్మోహమగును. అద్దానివిపరీతములగు నైచ్యదైన్య హైన్య దౌర్బల్యభీరుత్వాదులైన అర్థనాశక గుణోత్పాదకములగు తామసగుణజన్యభావ విశేషములచే హృదయమాక్రమింప బడుట దుర్మోహమగును. అతిశయభావముగాని, దీనభావము గానిలేకుండుట విమోహమని చెప్పనగును.

పూర్ణజ్ఞానపరిపాక రూపమగు విమోహస్థితివిషయము ద్వంద్వాతీతమై సామాన్యముగ లోకోత్తరాంశ మగుటచే నార్థికవిషయముల నద్దానినటుంచుదము. పైవివరించిన రీతిని ఆర్థికప్రకరణమున సామర్థ్యసంపాదకమగు సమ్మోహమును, అసామర్థ్యతాప్రభవమగు దుర్మోహమును నిరంతము జనుల యొక్కయు, జాతులయొక్కయు మనముల నావరించి వారి యభివృద్ధివినాశములకు మూలాధారమై పనిచేయుచునేయుండును. సమ్మోహదుర్మోహములు రెండును ఆరోపణచే గలుగు నవియే అయియున్నవి. ఈయారోపణ స్వకృతమైనను గావచ్చును. పరకృతమైనను గావచ్చును. కాని సామాన్యముగా పరమూలకారంభమైన ఆత్మమూలకావసాన మగుచున్నది.

---

1. Politics.

ఆంధ్రమహోద్యమ తత్త్వము.

ఆరోపణ విద్యయొక్క స్వభావమును, మహిమమును ఇంచుక తేటపఱచినగాని ప్రకృతవిషయమున దానివలనఁ గలుగు లాభనష్టములు సంపూర్ణముగ తెలియరావు. మనస్సునకు గొప్పదుర్గుణమొకటిగలదు. పదిమారు లేదేనియొక యభిప్రాయమును పట్టుదలగానారోపించుచుండిన యెడల అట్టియభిప్రాయమును నిశ్చితముగా నదిస్వీకరించును. అట్టియభిప్రాయము యుక్తియుక్తముగాగాని, వాస్తవముగాగాని ఉండవలయునను అవసరములేదు. ఎంతదురభిప్రాయమైనను అదియుక్తియుక్తముగను, నిర్వివాదముగను దోచును. ఇందుకు వేనవేలుగ నుదాహరణములీయవచ్చును. హిందువులకు విగ్రహారాధనయంత ఉపయుక్తమగు విషయము లేదనుట కరతలామలకముగ దోచును. కాని క్రైస్తవులకును, మహమ్మదీయులకును అయ్యది దూష్యమనువిషయమునిర్వివాదాంశము. పినతండ్రికొమార్తెను వివాహమాడుట దూష్యమనువిషయమున హిందువులకు సందేహములేదు. దానికికారణము వారాపయబోరు. మహమ్మదీయులకంతకంటె సొబగైనట్టియు, న్యాయమైనట్టియు విషయముదోచదు. సకలజీవరాశియు మనుష్యునికొద్దియో యొక ఉపయోగమునకై దేవుఁడుసృజించెనని పాశ్చాత్యులు నిర్వివాదముగనమ్ముదురు. అదివిపరీతముగను, హాస్యాస్పదముగను, ప్రాచ్యులకు నిర్వివాదముగదోచును. ఈవిధమైన నమ్మకములును, భావములును, శైశవముమాదిగా పరిసరములనుండి గ్రహించిన ఆరోపితాంశములే. ఇవి గుణాగుణవివేచనకు విపరీతములై బలవదభిమానములనైతము గల్పించుటకు కారణభూతములైనవి. అస్లేదురభిమానమును గల్పింపగలవు. మానవుని అభ్యున్నతి

అధఃచ్యుతులు వానిమనోవైఖరి ననుసరించి యుండుటనుగాన నివియు ఆరోపితభావసూత్రాధారములే. ఆరోపితభావములు ఉత్సాహసంధాయకములై సమ్మోహవిషయికము లైనచో మానవుఁడు చైతన్యస్థితికి రాఁగలఁడు. అట్లుకాక ఆభావములు దుర్మోహజనకము లైనచో వాఁడు పదభ్రష్టుఁడగుచున్నాఁడు. సమ్మోహపరవశుఁడైనవాఁడు అమానుషకార్యము లొనరించుటయు, దుర్మోహాభిహతుఁడైనవాఁడు కదలమెదలలేక విస్మృతిజెంది మృతకల్పుఁడగుటయు శాస్త్రప్రసిద్ధము. అట్లే సమ్మోహపరవశములై జాతు లున్నతదశం బొందుచున్నవి. దుర్మోహవివశలై అధఃపతితములగుచున్నవి. ఇపుడు ప్రాచ్యప్రపంచమందుండు జాతులకును ఇతరజాతులకును నిదియేభేదము. ఆంగ్లేయ జర్మను మొదలగు జాతులవారు సమ్మోహము కల్పించుకొని తదితరుల కంటె తాము అత్యుత్తములను భ్రాంతిని పోషించుకొనుచున్నారు. ఈభ్రాంతియే, ఈసమ్మోహమే కాలక్రమమున ఆభిజాత్యమను ఉత్తమగుణమును వారియందు నెలకొల్పుచున్నది. ఇయ్యది పెఱుగను పెఱుగను ఉత్సాహమునకును జాత్యభిమానమునకును కారణమగును. సమ్మోహరోపణము వలన జాతు లెట్లున్నతస్థితిని బొందుచున్నవో దుర్మోహారోపణచే నట్లే యవి వ్యక్తిభ్రంశము నొందుచున్నవి. ఇయ్యది యెఱిగియే పాశ్చాత్యులు తాము ఆక్రమింపదలచిన ప్రదేశములకు ముందుగా మిషనరీలను బంపుట. మిషనరీ లేదేనియొక దేశమును జేరిన దినమునుండి ఆదేశమునకు హీనదశప్రారంభమగుచున్నది. వారిపనియేమన "మీవారికి మతములేదు. మీవారికి సంఘసంస్థితులు లేదు. మీవారికి నాగరకతలేదు"

అని కన్నెఱుఁగని పసిబాలురకును, అల్పవిద్యావంతులకును ఆరోపించుట. లక్షమార్లారోపించిన గోడకేని ఒకరాయి రాలదా? ఈ ఆరోపణ విద్యాప్రయోగము జఱుగనుజఱుగను ఆదేశస్థులలో కొందఱేని వారినినమ్మి వారిపక్షమవలంబింతురు. అప్పటినుండియు ఆజాతివారు కీలూడినబొమ్మలవలె వికావికలై పోవుటప్రారంభింతురు. అటుతర్వాత ఆదేశస్థులను జూరఁగొనుట నిముసఁపుబని. ఈకుత్సితము నెఱిఁగియే జపాను దేశస్థులు సయితము తమసామ్రాజ్యవ్యాపకమునకై దేశముల జయింపఁగోరి ముందుగా ఆయాదేశములకు బౌద్ధమతబోధకులగు భిక్షుకులఁ బంపఁజూచుచున్నారు. ఆధునిక ప్రపంచమందు జనులు జేయు పారమార్థికప్రయత్నములు సైతము ఆర్థికవిచార గర్భములేగదా! ఇది మిక్కిలి గర్హ్యము.

అన్యభాష రాజభాషయగుట యిట్టిమహాశక్తిగలిగి జాతుల గిట్టించు అద్భుతప్రభావముగల దుర్మోహమునకు హేతువు. దానిచే జాతి దినదినక్షీణమై తుదకునశింపనుగూడ నశించును. కావున జాత్యభివృద్ధిగోరువారిట్టి దుర్మోహమును బారదోల ప్రయత్నింప వలెను. రాజభాషావ్యవసాయకులు దేవకల్పులన్నభ్రాంతి విఱియునట్లొనర్పవలెను. రాజభాషాపండితులన్న తమబాంట్లేయనియు, తమకంటె జాతిసంఘమునందు వారెక్కువ గౌరవపాత్రములుకారనియు, నమ్మకముఁ బొడమజేయవలెను. ఇట్టికార్యమొనరింప శక్తిగలిగినది ప్రత్యారోపణయే. ప్రథమారోపణ సుకరముగాని ప్రత్యారోపణ దుష్కరము. దుర్మోహముచే 'మూఢుఁడను, కష్టుఁడను, పశుప్రాయుఁడను' అనిదృఢనమ్మకముతో బాధపడువానికి 'అతి

మనుజుడను, సర్వసమర్థుడను' అను పరిజ్ఞానము బోధించు టెంతకష్టపుపని! స్వభావముచేతనే పిఱికియనుకొనువానిని ధైర్యవంతునిగా జేయుట దుస్సాధ్యము. కాని ఈశక్తి ప్రత్యా రోపణకు కలదు. కావున శ్రేయోభిలాషులెల్ల ఈ ప్రత్యారో పణమును ప్రాపింపజేసి విదేశభాషాభిజ్ఞులకును, స్వదేశభా షాభిజ్ఞులకును గల యంతరమును జంపవలెను. అయ్యది కానినాడు జాత్యభివృద్ధి చేకూరదు. దుర్మోహాంధకారమును చీల్చివేసినగాని జాత్యుత్సాహము కలుగనేరదు. లేనిచో జాతి ప్రయత్నములు దుష్ఫలములందు వర్తించి జాతివిలయమును అనతిదూరస్థమగునట్లొనర్చును. కావున నెన్నివిధములచేతను దుర్మోహము ఛేదించుట కర్తవ్యము.

కాని ఈకార్య మొనరించుటెట్లు? దుర్మోహమునకు కారణభూతమైన యవస్థను బాపుటయేగదా ప్రథమకర్త వ్యము. అన్యభాషాభ్యసనము, ముఖ్యముగా రాజభాషాభ్య సనము అతిబాల్యమందే జేయుట ఈదుస్థితిమూలమని కనియుంటి మి. కావున దేశభాషకు ప్రాధాన్యమిచ్చి దేశభాషచే జాతీయ వ్యక్తిపరిజ్ఞానము గలిగినవెనుక ద్వితీయభాషగాను, ఐచ్ఛిక భాషగాను రాజభాషను గ్రహించు నట్లొనర్చుట మనకు ప్రథమవిధి.

ఇంతవరకు దుర్మోహశోషణము, భాషాగ్రహణతత్వము. కాని విద్యాలయములందు దేశభాషకు ప్రాధాన్యమిచ్చినంత మాత్రమున మనయాదర్శములో, సహస్రాంశముగూడ సిద్ధిం పదు. మఱియు వ్యావహారికభాష ఇంగ్లీషుగానుండి, విద్యా లయములయందు ప్రధానభాష దేశభాషగానుండుట సాధ్య

ముగాదు. ఆంగ్లేయదొరతనమువారి యౌదార్యముచే నొకవేళ ఆంగ్లేయమును ద్వితీయభాషగా మన విశ్వవిద్యాలయముల వారు పరిగ్రహించినను వ్యవహారములయం దింగ్లీషు అనన్య స్వభావద్యోతకముగాను, రాజసేవాప్రదాతగాను, బహుమానవిక్రేతగా నుంటంబట్టి, విశ్వవిద్యాలయముల నిర్బంధముచే దేశభాషకు ప్రాధాన్యము కలిగినను దేశభాషలు మనుజ భాషలే యను దుర్మోహము విద్యార్థులయొక్కయు జన సామాన్యము యొక్కయు మనములనాటుకొనియే యుండును. వ్యవహారమునందు ప్రతిచిన్నవిషయమునకును ఇంగ్లీషు కావలసియుండ, దేశభాషయు దివ్యభాషయేయను సమ్మోహారోపణ కెడముగలుగుటకు వీలులేదు. ఇపుడు మనరాజ్యమం దిట్టి స్థితిగలుగుటచేతనే దేశభాషకు పునరుజ్జీవము పోయలేకున్నారము. దేశభాషలయందు వ్యాసరచన (కాంపొజిషన్) ఇంటర్మీడియేట్ పరీక్షకుబోవువారికి నిర్బంధముగానుండినను వాని యభివృద్ధి చేకూర్పలేకున్నారము. అయ్యది వేఱుగానొక భాగముగానుండి దానిలో తేరినగాని, పరీక్షలోకడ తేరరని శాసించినపుడుగాని, ఇటీవల దాని నింగ్లీషుతోజోడించి ఇంగ్లీషునందు పరీక్షయగుటకు దీనియందుంగూడ కావలెనని శాసించి నపుడుగాని విద్యార్థిసామాన్యము స్వభావముచే కాకపోయినను నిర్బంధము చేత నైన దేశభాషలందు శ్రద్ధవహింపలేకున్నారు. ఇంక నిట్టిమార్పులు, కుయుక్తులెన్ని జేసినను, విశ్వవిద్యాలయములంగల మనహైందవులమనోరథములు కొనసాగంజాలవు. కారణభూతములైన యంశములజోలికిబోక పైమెఱుంగులెన్ని జేసిన నేమిప్రయోజనము? నిప్పునుచల్లార్పక పొగకే

మాదిరిగొట్టము పెట్టినను పొగవచ్చుచునేయుండునుగాని రాక కమానదు. మట్టిపాత్రమునందు నీరుబోసి మూతబిగించి క్రింద మంటఁబెట్టినచో అయ్యది ఆవిరిశక్తిచే బ్రద్దలగుచున్నది. అట్లని మట్టిపాత్రమునుదీసి దానికిబదులు బంగారుదిగాని, యినుపది గానిబెట్టినచో పగులకమానునా ? అట్లు అదివిచ్చుటకు కారణ మైన లోనీటినిగాని, వెలిమంటనుగాని తొలగింపవలెను. అంత వఱకెన్ని పాట్లుబడినను, పాత్రమువిచ్చునని యెన్నివిధముల విల పించినను నిష్ప్రయోజనము. అట్లే ఒకసందర్భసన్నివేశమున నొకకారణ మొకఫలమిచ్చిన అదేసందర్భముల నదేకారణము వేఱొకఫలము నెన్నిప్రయత్నముల నియ్యఁజాలదు. కావున మన దేశమందు దుర్మోహమునకు మూలమైన భాషాసందర్భముల నేర్పఱచి (ఆంగ్లేయమును వ్యావహారికభాషగానుంచి), వానిని మార్చక, మనమిపుడు విచారపడు దేశభాషాదైన్యమును బో నాడవలెనని మనవారు విశ్వవిద్యాలయములందుజేయు కార్య ములెల్లను నిరర్థకములు, మతిమాంద్యమూలములును. విద్యా ర్థికి తనయావజ్జీవపర్యంతమును ఇంగ్లీషుభాషయే వ్యవహార ములయం దేదుగడయనియు, అయ్యదిరానినాడు తాను జీవయా త్రఁజేయుట కష్టమనియు దృఢనమ్మకముఁ గలిగియుండ నిష్ప్ర యోజనకారియై, దుర్మోహపరవశుఁడైన అతని దృష్టికి మూక భాషగా గోచరించు దేశభాషయందు శ్రద్ధయేరీతిని జనించును? మనమొకవేళ ఆందోళనముచేసి దేశభాషాపఠనమే దేశసేవ యని బోధించినను ఆయాందోళనమున కీసందర్భముల నెంత ఫలము గలుగవచ్చునో నంతియకాని విశేషించిరాదు. అదియు మనమిపుడు కన్నులారఁ జూచుచునేయున్నారము. దేశభాషా

పక్షపాతిమైన యాందోళనము జఱిగిన బంగాళాంధ్రదేశముల దేశభాషల విద్యార్థులశ్రద్ధఁ జూడుఁడు. ఏమియులేని యరవదేశమునుఁ జూడుఁడు. పూర్వరాష్ట్రములయం దాందోళనఫలము తెలియుచునేయున్నది. కాని సందర్భములన్నియు ప్రతికూలములగుటచే ఆందోళనమునకుఁ దగిన ఫలము కలుగలేదు. ఏలననగా మనము కారణముల నిర్మూలింపక 'అదితీసియిది, ఇది తీసి యది' మార్చుచున్నారము. ప్రథమభాష తెనుగుగా నేర్పినఁగూడ తెనుగునకు మంచిదినములు రావు. దుర్మోహము విఱియదు. దుర్మోహమును ధ్వంసముజేయవలెనన్న తెనుగును వ్యావహారికభాషగా నొనర్పవలెను. దేశభాషను ప్రథమభాషగా నొనర్చుటయే రెండుభాషలవారిని జోడించిన రాజ్యమందు మిక్కిలికష్టము. అట్లుండ వ్యావహారికభాషగా నొనర్చుట అట్టిరాజ్యమందు మఱింత దుస్సాధ్యమేకాక, అసాధ్యము సైతమగును. రాజ్యమునం దొకమూలనుండి మఱియొకమూలకు రాకపోకలు జఱుగుచుండ వ్యావహారికభాషలు రెండగుటఁ బరస్పరము స్పర్ధించును. అట్టిస్పర్ధచేనవి పరస్పరము జంపుకొని మాడవదగు అన్యభాష స్వేచ్ఛావిలసనమున కెడమిచ్చి తాము నశించును. దేశభాషల వ్యావహారిక భాషలుగా జేసినగాని దుర్మోహము నశింపదనియు, అయ్యది నశించినగాని దేశక్షేమము సమకూరదనియు నిదివఱకే నుడివియుంటిమి. కావుననే ఆంధ్రులు ఇరుబాసలవారికిని క్షేమముగలుగు తెఱఁగువిచారించి చెన్నరాజ్యమును ఆంధ్రద్రవిడరాష్ట్రములుగా ద్వైధీకరింపుమని ఆందోళనము సేయుట. ఆంధ్రరాష్ట్రమును విడదీసినచో ఇతరలాభములట్లుండ తెనుగును ప్రధానభాషగాను,

వ్యావహారిక భాషగాను ఒనర్పఁగలమనియు, అందుచే మనయువ కులకు ఇంగ్లీషు నేర్చుకొనుటకుబట్టు ఇరువదిసంవత్సరముల ఆయుస్సు వారికిఁబోసినవారమేకాక, భాషావ్యక్తియు, జాతీయ వ్యక్తియు దినదినప్రవర్ధమానములై మహాదుర్యోగమహాశృంఖల ముల దెగనఱికి స్వేచ్ఛాజీవనమును ప్రసాదింప, తన్మూలమున మన యాదర్శముల శీఘ్రముగా బడయుదుమనియు, వానిచేయు మార్గము ఇదియేతప్ప వేఱొండులేదనియు ఆంధ్రులగు మన యాశయము.

కాని ఇదెంత దుర్ఘటమైనకార్యము? దీనిని చేయుట కాదుగదా, తలపెట్టుటగూడ ఇప్పటి మనదుస్థితియందు సాహ సముగాతోఁచెడిని. తెనుగును (మఱియేదేశభాషనుగాని) వ్యావ హారికిభాషగా నొనర్చినచో మనము ఇంగ్లీషుభాషను విడిచి బ్రతుకు టెట్లనువారును, దొరతనపువారాంగ్లీషువారై యుండ ఇది యెట్లు సాధ్యమగుననువారును, నూటయేబది సంవత్సరము లుగా నింగ్లీషు విద్యావ్యవసాయముచే మనము నవనాగరకుల మగుచుండ నిప్పుడేల వెనుకంజవేసి గ్రామ్యజానపదులము గావలెననువారును, దేశభాషలందు నవీనశాస్త్రములు మొద లైనవి లేవే, మనయభివృద్ధి యెట్లుచేకురు ననువారును, మీదు మిక్కిలి ఆంగ్లేయ భాషాభ్యాసమున మనము మునసబులును, జడ్జీలును, డిప్టీకలెక్టరులునై, ఇపుడు దానిఁబోనాడఁజూచుట కృతఘ్నతయనువారును, జనులు బహుభంగులై యున్నారు. దీనికంతయు కారణమొక్కటియే. హృదయదౌర్బల్యము.

అట్టివారందఱకును కృష్ణుఁ డర్జునునకుజెప్పిన యుపదేశముఁ జేయవలెను.

> కుతస్త్వా కశ్మల మిదం। విషమే సముపస్థితమ్ ।
> అనార్యజుష్ట మస్వర్గ్య। మకీర్తికర మర్జున॥
> క్లైబ్యంమాస్మగమః పార్థ। నైతత్త్వ య్యుపపద్యతే।
> క్షుద్రం హృదయదౌర్బల్యం। త్యక్త్వోత్తిష్ఠ పరంతప॥

ఏకార్యమైన నిదియగునాయని వెనుకకు విఱుచుకొని పడిన నదియగుట దుర్లభము. ఉత్సాహము, ప్రారంభము, పౌరుషము ఈమూఁటినిపాటించి మానవుఁడు ఫలోదయమునుగాంచవలెను. దేశభాషలను వ్యావహారికభాషలుగా నొనర్చుటకు మన కెన్నియో అంతరాయములు గలవు. కాని ఈకార్యము సాధింపలేమనుట పొఱఁబాటు. ఇంగ్లీషువిడిచి బ్రతుకలేమనుట అంతకంటెను పొఱఁబాటు. మీఁదుమిక్కిలి ఇంగ్లీషుభాషవిడువక పోయిన మనజాతి చాలకాలముజీవించుట దుర్ఘటము.

మన ఈయుద్యోగమందు ప్రభుత్వమువారు సానుభూతి చూపింపరనియే తోఁచుచున్నది. వారుచూపినను, లేకపోయినను వారిసహాయ మితరవిషయములందువలెనే మన మపేక్షింపక జాతీయసత్త్వమునే నమ్ముకొని కార్యధోరణికింగడఁగుట యుత్తమపక్షము. జాతీయసముద్ధరణదీక్ష వహించినవారు స్వబలము చేతనే కార్యముల సమర్థింపయత్నించవలెను. పరసహాయ్యాపేక్ష పెట్టుకొనియుండినన్నాళ్లు మనకు ముక్తిగలుగనేరదు. మనప్రయత్నములకు ప్రతిపక్షులసహాయమున కెదురుచూడకుండుటయేకాక, వారివలనఁగలుగు అంతరాయముల భేదించు బలము సహిత ముండవలెను. అందువలన దేశభాషల వ్యావ

హారికములుగాఁ జేయ మనమొనర్చు ప్రారంభము అశేషజాతి సముద్యోగమైయుండవలెను. ఈ ప్రయత్నమునందు మనకు జాతీయమనోనిశ్చయమును, సాత్వికనిరోధములును సుఫలదాయకములు. జాతీయోత్సాహప్రకంపను ప్రేరేపించి, ఒక్కొక్కని హృదయాంతరాళమందును మాఱుమ్రోగునట్లొనర్పవలెను. దేశభాషయందు మనయువకులకు ఆదరమును గౌరవమును హెచ్చునట్లు దేశభాషాపండితులను కవిశిఖామణులను సన్మానించి, దేశభాషలయందు సారస్వతము నభివృద్ధిపఱుచుటయేకాక, సర్వజనలభ్యముగా నొనర్పవలెను. దేశభాష లింగ్లీషుతోదీటుగావను దుర్మోహమును విడియునట్లొనర్పవలయును. ఇదంతయు మనముచేయగలిగినపనియే. ఈప్రయత్న మిపుడు ఆంధ్రసీమయందు జరుగుచునేయున్నది. ఆంధ్రులహృదయము లుత్సాహపూరితములై ఆంధ్రభాషయందు వ్యవసాయమున కభిముఖములగుచున్నవి. కాని ఇంతవఱకైనది వలసినదానిలో సహస్రాంశమును గాదు. ప్రతియాంధ్రునకును తనభాషయందు పరిచయమును, సారస్వతమందుశ్రద్ధయు, భాషాభిజ్ఞులయందు గౌరవమును సోదరభావమును జనించువఱకును మనమీభాషాపక్షపాతమగు నాందోళనము జఱుపవలెను.

ఇంతవఱకును మనమంతరాయములేక జఱుపఁగలిగినదే. దీనితోసమకాలికముగ మఱొకకార్యము పూనుకొనవలెను. అదేదన పరభాషలయందు వ్యాసంగమును, ఆసక్తియు తగ్గించుట ఈవ్యాసంగము దేశక్షేమమున కనుకూలమేగాని మనకిప్పు డుండుదాని ప్రమాణముఁజూడ నది అష్టమవ్యసనముగా నయి

సట్లు తోచుచున్నది. ఈకార్యమున మనకుకొన్ని సహాయకారులైన అంశములుగలవు. అన్యభాష నభ్యసించు వారిసంఖ్య మెండగుటచే వారియందు గలుగుఅనాదరణము మొదటిది. వీంరదతికిని రాజసేవదొరకమిరెండవది. వీనిహాయ్యముగొనుచు, మనమాందోళనముచేయుచుండ, ఆంగ్లభాషకంటెదేశభాషలే యుత్కృష్టములని మనవారిమనముల నాటుకొనుస్థితికి శీఘ్రకాలములోనే వచ్చెదము. ప్రభుత్వము వారితో వ్యవహారము జరుపుసమయమునతప్ప ప్రతివిషయమునందును మనకు దేశభాషలే భావద్యోతకములగు అవస్థ బొందుదుము. జాతీయమనోనిశ్చయమునకు సత్వము గలుగును. ఇదియే మనకుత్తరకార్యములకు సాధనము. మనకు గమ్యస్థానము పిమ్మటసుగమము. జాతీయమనోనిశ్చయము సహాయమున మనము పరభాషావ్యవసాయకుల సంఖ్య తగ్గించఁగలుగుదుము. జాతివారంతయు వారిని నిరాదరభావముతోఁ జూచినఁజాలును. జాతియందు సమ్మానముగలుగఁనియేగదా వారికి పరవిద్యలయం దభినివేశము. అట్లుకానినాడు వారువాని తెలివైనను బోవుటయసంభవము ఇంగ్లీషుచదువకపోవుట రాజద్రోహముకాదుగదా? అందుచే మనముప్రభుత్వమువారియెడ ననపరాధులమయ్యు కార్యము సాధింపగల్గుదుము: ఆంగ్ల భాషావ్యవసాయకులు లేకపోయినను వారిసంఖ్యతగ్గినను ప్రభుత్వమువారు తెలుఁగునే వ్యావహారిక భాషగా నంగీకరింపకతప్పదు. విధిలేదు. ఇదియే ఆంధ్రోద్యమముయొక్క అంతస్సారము. దీనికిజాతీయమనోనిశ్చయము బలము. ఆంధ్రప్రత్యేకరాష్ట్రముపకరణము. ఆంధ్రజాతిసముద్ధరణము, తన్మూలమున దేశోద్ధరణమును పరిణామములు.

ఆంధ్రోద్యమము హైందవోద్యోగమువలెగాక మిక్కిలి సత్వసారమైనది. హైందవోద్యోగము కొన్ని యనివార్యకారణములంబట్టి దుర్బలమైయున్నది. అందులో మొదటిది ఆంగ్లేయ భాషాపోషితులగు[1] హైందవులచేనుద్ధరింపఁబడుట. ఈవిషయము పైకిచూచుటకు హాస్యాస్పదముగానుండునుగాని తత్వము విచారించిన నిందలిన్యూనత తేటపడఁగలదు. ఆంగ్లేయభాషా పోషితులగుటచే ఆదర్శవిచారమునందు హృదయసౌష్టవములేమియు, పాశ్చాత్యమార్గముల శిక్షనొందిన వారలగుటచే హైందవ జాతి వ్యక్తిగానలేక హైందవదేశోద్ధారణకు పాశ్చాత్యమార్గములే తాంత్రికములనుభ్రమయు దీనికిసద్యఃఫలములు. ఇప్పటికిని మన దేశమందు యాంత్రికపరిశ్రమయు, ఆంగ్లేయభాషయును మాత్రమేతప్ప మనకేమగడ లేదని నమ్మువారెందఱులేరు? ఆంగ్లేయ సామ్రాజ్యమునుండి వారుమనల వెడలఁగొట్టినగాని, ఐరోపా నాగరకతఁబోనాడినఁగాని మనకు బ్రతుకుదెరువులేదని నమ్ము వారెందఱులేరు? ఆంగ్లేయసామ్రాజ్యము నుండి వారు మనల వెడలఁగొట్టరు. మనకీభయమక్కఱలేదు. ఐరోపానాగరకతఁ బోనడువవలెనని మాయాశయముగాదు. కాని యాథాతథ్యముగా తత్పరిగ్రహణము మనజాతివ్యక్తికి చేదుమ్రింగుటయని తెలియవలెను. ఐరోపాహైందవ నాగరకతల సంయుక్తిచే మన దానికెంతవఱకు మెఱుఁగురాఁగలదో అంతవఱకది పరిగ్రాహ్యమేగాని, హైందవనాగరకతను త్యజించి రెండవదానిని గ్రహించుట హిందూదేశమందుఁగల వారిని రూపుమాపి పాశ్చాత్యుల

1 ఇటీవల నియ్యదిమాఱినది. ఈ సూత్రము మితవాది సామాన్యము యొడవర్తించును.

నిచ్చుట కాపురమిడుటయే అని చెప్పవలెను. ఐరోపానాగరకతను యథామాత్రకముగా మన మవలంబించినపిదప మనయందు హైందవమని చెప్పదగినదేదియు నుండదు. జపాన్ చీనాదేశస్థు లభివృద్ధిజెందినమార్గమును ముచ్చటించుచు, టాల్‌స్టాయ్ అను మహనీయుఁడు, చీనాదేశస్థునికి వ్రాసినలేఖలో నిట్లువివేకులై అన్యజాతినాగరకతను, అన్యజాతిమార్గములను, అన్యజాత్యాదర్శములను అవలంబించిరని మిక్కిలి చింతించెను. జాతి స్వత్వమునుగోలుపోయి అన్యజాత్యాదర్శములు పరిగ్రహించుటచే ఉభయత్రభ్రష్టమగు చున్నది. స్వత్వమూ మఱచిపోయినది. అన్యజాత్యాదర్శమూ స్వజాతిమానసికసంస్థానమునకు సరిపోవు నదికాదు. కావుననే జాత్యుత్సాహమునకు పరిణామము స్వజాతి వ్యక్తిని బలపఱచుకొనుటయేయని విన్నవించియుంటిమి. అట్లే ఐరోపాహైందవ నాగరకతలు రెండును బలపడి అన్యోన్యోత్కృష్ట్యుద్యోతకములుగాను, అన్యోన్యలోప పూరణములుగా నుండుటయే ఈరెంటి సంఘర్షణకును పరిణామము.

హైందవప్రోద్యోగము బలహీనమైయుండుటకు ప్రబల కారణములలో రెండవదీయాందోళనము ఆంగ్లేయభాషయందు * జరుగుట. ఇది అనివార్యమైన సందర్భమే కాని ఉద్యోగపాటవమునకు మిక్కిలి అనర్థకరము. ఇప్పటికి ముప్పదిమూడుసభలు జఱిగినవి కాని జనసామాన్యమునకు సంపూర్ణవిజ్ఞానము సమకూరకున్నది. ఈఆందోళనము ఇంగ్లీషుభాషాభిజ్ఞులలో చాల

---

* ఇదివ్రాసినపిమ్మట కాంగ్రెసుమహాసభ దేశభాషపక్షపాతియు సామాన్యభాషావాదియు నైనది.

మందిని మేలుకొల్పినది. అంతవఱకును సుగుణమేగాని తదితరులకు మన యాదర్శతత్త్వముగాని ఆందోళనావిధానముగాని దుర్బోధ్యము. దీనియందుఁగల దౌర్బల్యహేతువరసి దానం గలుగు అవాంతరముల బలము నల్పీభూతముజేయఁ బ్రయత్నింపవలెను. ఇన్ని నాళ్లకు మనమియ్యది గమనింపకపోతిమి. నేడుఆంధ్రోద్యమముతో నట్టియవాంతరముల లోలఁగఁద్రోయు తెఱఁ గేర్పడెను. ఇన్నినాళ్లను హైందవోద్యోగము జీవము లేనిశరీరమువలె నిలువలేక కూలుచు నెట్లో నిలిచియుండెను. కావుననే మనము స్వరాజ్యమడిగినపుడు ఆంగ్లేయదొరలీ కల్లోలమంతమంతయు 'ఎడుకేటెడ్ క్లాసెస్' పెట్టినదేగాని జనసామాన్యమునొక్క అభిమతముకాదనిరి. దీనికిజవాబు మనకు లేకపోయెను. ఇట్టిదుస్థితిని బాపి ఈయుద్యోగశరీరమునకు జీవమెట్లు సంధింపనగునో తెలియకుండెను. ఇటీవల బంగాళములో జఱిగిన దేశభాషాపునరుజ్జీవనమువలననో లేక ఆంధ్రుల స్వభాషాభిమానమువలననో ఆజీవము ఆంధ్రోద్యమరూపమున లభించెను. దేశీయమహాసభల యభిప్రాయములకు బలము గలిగించుటకును, నిరాకరింపఁడిన మన ఈప్సితముల నెవ్విధముననైన సాధించుటకును మార్గమిదియే. ఇదియే మనప్రతిపక్షుల కుతర్కమునకు జవాబు. ఈ యాంధ్రోద్యమము దేశభాషలయందే యాందోళనము చేయుచుండ అత్యల్పకాలములోనే జనుల కందఱికిని రాజ్యాంగ వ్యవహారములు సుబోధ్యములగు చున్నవి. ముప్పది సంవత్సరములుగా జఱిగిన హైందవమహాజనసభ దేశములో నేమూలఁగాని పెట్టలేనంత సంక్షోభము ఆంధ్రమహాసభ ఐదుసంవత్సరములలో నెఱవేర్ప

గలిగెను. ఆంధ్రులలో బహుజనము నేడు రాజకీయవ్యవహార ములయందు జోక్యము పుచ్చుకొనఁగలిగియున్నారు. ఈచర్చ లన్నియు నింగ్లీషుభాషలో జరిగినపక్షమున శ్రద్ధపుచ్చుకొన లేనియనేకులు మహోత్సాహముతో తమ సేమమును సమ కూర్చుకొనుటకై కంకణము గట్టుకొనియున్నారు. స్థూల ముగా ఆంధ్రమహాజనసభకును, దేశీయమహాసభకును భేదమి య్యది. వారు స్వరాజ్యమిప్పింపుఁడు అని దొరతనమువారిని ప్రార్థించుచున్నారు. వీరు ప్రజలను ప్రార్థించుచున్నారు. ఈ రెంటిలో నెయ్యది యుత్కృష్టమో చెప్పనక్కఱలేదు[1].

అట్లు సర్వార్థకల్పద్రుమమైనయాంధ్రజాతి పూర్వపుణ్యమున సముజ్జీవితమైన ఈయాంధ్రోద్యమమునకు ప్రత్యేకాంధ్రరా ష్ట్రము సహాయకారి. ఇయ్యది ఆంధ్రజాతి ఆదర్శముల బడ యుటకు ఉపకరణమాత్రమని తెలియవలెను. ఆంధ్రరాష్ట్రమే ఆంధ్రోద్యమమునకు పరిణామమని యెంచుట అవివేకమును, ఆంధ్రోద్యమ ప్రాపకుల యుద్దేశము గ్రహింపలేమియును. తన్మూలమున నితరములై అన్నిటికంటె నుత్కృష్టములైన యాదర్శముల జేరఁగలుగుదుమని యే సద్యఃకాలమున ఆంధ్ర రాష్ట్రమును గోరుట. ఆంధ్రజాతివ్యక్తి వెలయుజేయుట కిది సోపానమాత్రము. అట్లుకాదేని దైవసహాయమున ఆంధ్రరా ష్ట్రము మనకు శీఘ్రకాలములో సమకూరిన మనమీయాంధ్రో ళన పరిత్యజింతుమా ? అసాధ్యము. ఆంధ్రరాష్ట్రము ప్రత్యే కింపబడిన ఆందోళనము మఱింత ప్రవేగముతోను, చలము

1. ఇది వ్రాసినవెనుక దేశీయమహాసభయందు చాల పరివర్తనము జరి గినది. అదిసయితము ఆంధ్రమహాసభ మార్గములలోనే బడుచున్నది.

తోను జఱుగుచునే యుండును. పరిణామములగు ఆదర్శములం జేరువఱకును దీనికి విశ్రాంతి లేదు.

కాని, దేశమం దెన్నియో భ్రాంతులు; ఎంతయో కుతర్కము. ఎంతయో మౌర్ఖ్యము. మౌఢ్యమును సవరింపవచ్చుంగాని, మౌర్ఖ్యమును సరిపఱచుట యసాధ్యము. ఆంధ్రరాష్ట్రము మనయరవసోదరుల నాంధ్రదేశపుపొలిమేరలు దాటిరానియ్యకుండుటకు కట్టుకంచెయని కొందఱవివేకులు దురభిప్రాయములు తెలుపుచున్నారు. అట్టివారికి ఆంధ్రోద్యమతత్త్వము మనస్సునందు సంపూర్ణముగ గోచరించలేదని యే చెప్పవలెను. అట్టి కుటిలాభిప్రాయములచే వారు తమ ప్రకృతిని అధోముఖగానొనర్చుకొనుటయేకాక ఆంధ్రోద్యమము యొక్క ఆదర్శములను కొంచెపఱచుచున్నారు. ఆంధ్రోద్యమము గవర్నమెంటుసర్వీస్ కొఱకై యింతపాటు పడుచున్నదా? రాజసేవవిడిచి బహుజనము స్వతంత్రవృత్తియందు జీవించుటకై పాటుపడుచున్నది. ఇయ్యది రాష్ట్రప్రతివాది యొక్కొక్కండును మనస్సునందు గట్టిగనమ్మవలెను. కాని ఇట్టి దుర్భ్రాంతికలుగుటకు కొంతవఱకును మనమే కారణము. కొంతవఱకు సూక్ష్మబుద్ధిలేమియు కారణము. రాష్ట్రమువాదమందు "తెలుగుదేశమున రెండుకలాశాలలు, అరవదేశమున పది. తెలుగుదేశమువాడొకండు హైకోర్టుజడ్జీ, అరవవారు నల్గురు" అనిమాత్సర్యద్యోతమైన తర్కవాక్కులచే ఇంతప్రమాదమునకు ఎడమయ్యెను. దానిచేతనే ఈ ఆంధ్రోద్యమము ఈర్ష్యాజన్యమను భ్రాంతికెడము గలిగి దాని పావనప్రేమాంకురములు మనస్సునకురాక మాసిపోవునట్లు తటస్థించెను. మనము సర్వకలాశాల

లకును హైకోర్టుజడ్జీలకును కుక్కలు ఎముకముక్కలకువలె పోట్లాడుచుండలేదు. రాష్ట్రవాదులు సయితము అట్టియభిప్రాయము గలవారుండిన వారు దానినిమార్చుకొనుట సముచితము. అట్లు మార్చుకొనక దుర్వ్యవసాయమునందు చలము వహించిన ప్రమాదమువాటిల్లును. ఆంధ్రులు ఈర్ష్యాగ్రస్థులను దురభిప్రాయమును నెలకొల్పరాదు. వలనన అట్టి నిందారోపణకు కారణము మృగ్యము. నిరతిశయప్రేమాపరిపాకమే ఆంధ్రోద్యమమునకు మూలము. "ఆంధ్రజాతీయాదర్శముల జేరి, ఆంధ్రజాతివ్యక్తి ప్రతివానిమనమందును నాటుకొనునట్లు జేసి ఆంధ్రరాష్ట్రపాలనాయంత్రమునకు మర్మము ఆంధ్రుల చేతికి వచ్చినపిమ్మట, అరవవారినేగాదు, నీగ్రోలను సయితము గవర్నరుమొదలుకొని పరిచారకునివఱకును నియమించి రాజ్యము సాగింతుము" అని ఒకానొకరు చెప్పిరి. అది యెంతయు నిజము. ప్రాణములు మనచేతియందుండిన నిర్జీవమైన శవమేమి చేయఁగలుగును? ఇపుడు రాజ్యాంగసంస్థానమునకు మర్మమంతయు ఆంగ్లేయుల పిడికిటియందుండ మనయాను శాసనీకసభ్యులును, మనహైకోర్టుజడ్జీలును మనకలెక్టరులును ఏమిచేయగలిగియున్నారు? ఎపుడైనను అంతియయనుకొనుఁడు. ఈతత్త్వము నెఱిగియే ఆంధ్రోద్యమము రాష్ట్రాంగసంస్థానముయొక్క మర్మము తనచేతిలోనికిఁ గొనప్రయత్నించుట. రాష్ట్రవాదులు కొందరైన నీసూత్రమును గ్రహింపనినాడు మనయుద్యమమునకు ధర్మాత్మకసంస్థితియును, ధర్మబలమును గ్రుంగుటయేకాక, దైహికసత్త్వము సహితము తఱిగిపోవును. బహుజనులు దీనిని ఖండింతురు. రాష్ట్రప్రతివాదులు దీనిని దెలియకపోవుటచే.

సగుద్యమమునకు భంగము కల్పించి, జాతిభ్రంశము నాపాదించినపాప మొడిగట్టుకొందురు.

ఆంధ్రులకు ప్రత్యేకరాష్ట్రమిచ్చుటచే ఆంధ్రభూస్వాములకు భూమిపన్నులు హెచ్చుననియు, రాష్ట్రమువలనఁ గలుగులాభములు ఆంగ్లేయవిద్యావ్యవసాయకులకే సనుకూరుచుండ దానివలని నష్టములుమాత్రము భూస్వాములకు వచ్చుననియు, ఇపుడు రాజకీయ ఉద్యోగవేతనములు ఆంధ్రులకు వచ్చినను, అరవలకువచ్చినను, ఆంధ్రభూస్వాములకు ఒక్కటియేయనియు మఱియొకవాదము. ఇందలి మొదటి యంశము భూమిపన్నులు హెచ్చునని. అదివాస్తవ మగునా కాదా ? ఒకవేళ నిజమైనచో గవర్నరు మొదలగు ఉన్నతోద్యోగులకేల వేతనములు తగ్గించి పన్నులు తగ్గించకూడదను ప్రశ్న వర్తించుట, తత్త్వము వ్రాయబూనిన మనపనిగాదు. కాని రెండవ యంశమందుఁగల తత్త్వమించుక విచారింపవలెను. అధికార వేతనములకై ఆంధ్రరాజ్యమును కోరుటలేదని ఇదివఱకే పరిపరి చెప్పియుంటిమి. కావున దానిని మరల ఖండింపబూనుకొనవలసినదిలేదు. కాని యట్టి మనవారియౌదాసీన్యము దేనియొక్క బహిర్విలసనమో చూడవలెను. ఇట్టి ప్రతివాదమును ప్రచోదించిన మనస్తత్త్వమును పరీక్షించవలెను. దీనియందుండు శక్తులు జాతివైకల్యము నాపాదించునవిగా తోచుచున్నవి. ఆంగ్లేయ విద్యావ్యవసాయకులు రహితులుకాకపోయినను స్వజాతీయులేయని ఈవాద మొప్పుకొనుచున్నది. జాతిలోనివారేయని అంగీకరించుచు (వాస్తవముగా లాభముయినపక్షమున) వారిలాభముకొఱకు తామావంతయేని పాటుపడవలసిన విధి

తమకు లేదని ఈప్రతివాదుల యాశయమని తేటపడుచున్నది. ఇట్టియౌదాసీన్యము చేటుగూర్చునని చెప్పకతప్పదు. జాతియన ప్రాణసహితమైన దేహమువంటిదని ఇదివఱకే తెలిపియుంటిమి. దానియంతర్భాగములకు అంగాంగసంబంధము స్వతస్సిద్ధముగా నుండవలెను. అయ్యది లేనినాడు జాతి చైతన్యరహితమై నాశనమొందును. ఈవాదమున, మనజాతియందంగాంగానుబంధపటుత్వము క్షీణించుచున్నదని తెలియుచున్నది. సమష్టిజ్ఞానము మాసిననాడు దేహము రోగావిష్టమగుట లేదా? అంగములకఱచుకొనుట, గిల్లుకొనుట, వెంట్రుకలుచించుకొనుట మొదలైన వైపరీత్యములు జన్నిలక్షణములు. అట్లే జాతివిషయమునను, అంతర్జాతివైషమ్యములును, అన్యోన్యక్షేమపరాఙ్ముఖత్వమును, జాతికి భావిప్రళయ లక్షణములు. అట్టిలక్షణములచే సూచ్యమైన మహోపద్రవమును వారించుటకు ప్రయత్నములు చేయవలెను.

కాని ప్రయత్నము చేయకపూర్వము వైషమ్యములకు కారణము తెలియవలెను. ఏదేని ఒకజాతియందంతఃకలహములు బుట్టుటకు కారణములురెండు (1) బహిఃపీడన లేకపోవుట (2) బహిఃపీడన శక్తికి మించినదగుట. జాతికి బహిర్భాగమున నుండి వత్తిడిలేకపోయినచో అంతర్భాగమున స్పర్ధలు జనించును. ఈవిషయము శాస్త్రసిద్ధము. అన్యరాజన్యులనుండి యుపద్రవము లేకపోవుటచే సార్వభౌములగు కౌరవపాండవులు పరస్పరముపోరి నశించిరి. వారలే గంధర్వరాజగు అంగారపర్ణునిచే బాధితులైనపుడు కలిసిపోరిరి. భారతయుద్ధానంతరము తక్కినరాజవంశములెల్లను నశించినపిమ్మట బహిరుపద్రవము

లేమిచే యాదవులు పరస్పరము కలహించి చంపుకొనిరి. రోము నుసామ్రాజ్యము ఉచ్చైస్థితికి వచ్చినపిమ్మట మార్కొనుటకు శత్రువులు లేమిచే రోమనుయోధులు తమలోతాము కలహించిరి. ప్రస్తుతము ఐరోపామహాసంగ్రామమును ఇట్టిమూలము గలదే. పాశ్చాత్యులు దేశదేశముల నాక్రమించి ప్రపంచ మెల్లను గచ్చపోదవలె నావరించినపిదప బహిరుపద్రవము లేకపోవుటచే తమలోతాము పోరుసేయుచున్నారు. యాదవకుల మునకు ముసలము బుట్టెనను సమాసోక్తి యాదవకులవిషయ ముననే వర్తించు లోకోక్తిగాదు. విశ్వముపాలించు శాశ్వత ధర్మ మిందిమిడియున్నది. బహిఃపీడన లేకపోవుటచే అంతఃకల హములు జనించునట్లే, బహిఃపీడన శక్తికి మించినదైనపుడు నైతము వైషమ్యము లుద్భవించును. క్షామముచే దేశమున ఆహారము లేకపోయినపుడు క్షుద్బాధ సహింపరానిదైనచో, ఆదేశములోని జనులు తమ భ్రాతృవర్గములోనివారని యెఱిగియే అన్యోన్యముఁ జంపి బక్షింతురు. కార్తేజ్ మహాపట్టణ వాసులు హానిబాలు అను యోధాగ్రేసరుడు విజయము పొందినన్నాళ్లు అతనిని శ్లాఘించి, రోమదేశపు సేనానాయ కుఁడగు స్కిపియో తనపట్టణముచుట్టును సేనలతో విడిసి నప్పుడు ఆపద వారింపరానిదగుట వారిలో వారుకలహించి హానిబాలును త్యజించిరి. ఇంకనిట్టియుదాహరణము లెన్నియో చరిత్రనుండి ప్రత్యేకింపనగును. కావునమనజాతియందును అంతఃకలహములు జనించినచో వానికి కారణము లీరెంటియందే దేని ఒక్కటిగానుండవలెను. మనజాతికి బహిఃపీడనము బొత్తుగ లేకనైన నుండవలెను; లేదా, అయ్యది శక్తికి మించినదైన నుండ

వలెను. ఈరెంటిలో నేదైనది చెప్పనక్కరలేదు. ఒక్కవైపున క్రిస్టియను మిషనరీల[1]యొత్తిడి, మఱియొకవైపున పాశ్చాత్య నాగరకతవలననైన యొత్తిడి[2], మూడవ వైపున పాశ్చాత్య ఆర్థికాభ్యున్నతి[3] యొత్తిడి, నాల్గవవైపున పాశ్చాత్యవార్తాసంస్థితి[4]నైన చల్లనియొత్తిడి. ఇట్లు నాల్గువైపులనుండియు ఓర్వరాని పీడనములచే మిక్కిలి బాధపడుచున్నారము. కాలము గడువను గడువను నీపీడనలు ప్రబలుచున్నవి. హైందవజాతికిని ఆంధ్రజాతికిని ఈపీడనలు దుస్సహములగుచున్నవి. వీనిబారినుండి తప్పించుకొను తెఱవుఁ గానలేకున్నారము. మనదుస్థితికి కారణము తెలిసికొనలేక దుర్మోహముచే బుద్ధిగోలుపోయి ప్రక్కనుండువారలే కారణభూతులనుకొని హిందువులు మహమ్మదీయులను, బ్రాహ్మణులు బ్రాహ్మణేతరులను, ఆంధ్రులు అరవలను, కర్షకులు భూస్వాములను, రాజసేవకులు తదితరులను నిందించుకొనుచు పరస్పరముఁ జంపుకొనఁ జూచుచున్నారము. ఇదియే మన యంతఃకలహముల తత్త్వము. అట్లుగాకుండిన బ్రాహ్మణులు బ్రాహ్మణేతరులును, ఎన్నియో శతాబ్దములుగా సోదరభావముననుండినహిందూమహమ్మదీయులును, అన్యోన్యము వీడి బ్రతుకలేని నియోగివైదికులును ఏల నేఁడొకరిపై నొకరు కత్తిదూయవలెను? ఇన్ని సంవత్సరములనుండియు బ్రాహ్మణులు బ్రాహ్మణేతరులును, హిందూమహమ్మదీయులు, తమ తమ కులగౌరవములను, కులసంస్థితులను తలపెట్టి అభివృద్ధి

1. Religious dismemberment.
2. Cultural aggression.
3. Political domination.
4. Economic Superiority.

పటిచుకొనలేనంత మూర్ఖులుగానుండిరా? ఎన్నటికిని కాదు. వారు బుద్ధిమంతులే. స్వకులాభిమానులే. మునుపొకయాచారము మనయభివృద్ధి కవరోధముకల్పింపక, ఇపుడదియే అనర్థకరముగా దోచిన నట్టిమార్పునకు ఆయాచారము కారణము కానేరదు. సందర్భ సన్నివేశములలోని మార్పే దానికి హేతుభూతము. ఆరోగ్యస్థితిలో రుచ్యమై హితమైనయన్నము రుగ్ణతయందు చేదైయుండుట అన్నమునందలి దోషముగాదని తెలియవలెను. ఆరోగ్యస్థితిమారి రుగ్ణతసంభవించుటయే దానికి కారణము. అట్లే మనయందుఁగల అంతర్జాతిభేదములు మునుపు రుచించి, ఇపుడు రుచింపకపోవుటకు భేదములు కారణములుగావు. మనస్థితియందుమార్పే దానికి కారణము. జ్వరము గుదిర్చిన మరల యన్నము రుచించునట్లే స్థితి బాగుపటచుకొనిన భేదములును అనింద్యములగును. ఈసూత్రము మనవారు బాగుగ నాలోచింపవలెను. మన ఉన్నతదశయందీభేదములుండి, మనదీనదశయందును ఈభేదములుంట, మనదైన్యమునకు గాని అధఃచ్యుతికిగాని ఇయ్యవి హేతువులు కావని స్పష్టమగుచున్నది. ఈ భేదములతోడనే మనము ప్రతాపరుద్రునికాలమున గణుతికెక్కితిమి. ఈభేదములతోడనే మనము విద్యానగరరాజ్యమును అసమానప్రజ్ఞతోడను, అపూర్వవిలాసముతోడను, అనల్పవైభవముతోడను ఏలితిమి. ఈ భేదములతోడనే మనము రాజరాజనరేంద్రునికాలమునఁ బ్రస్తుతిఁగాంచితిమి. కావున మనఈదైన్యమునకు ఈభేదములు కారణములు కాఁజాలవు. కావుననే మనపురోభివృద్ధికిని ఈభేదములు ఆటంకములు కానేరవు.

ఈభేదము లీరీతిగనే స్థిరముగా నుండవలెనని నాయాశయముగాదు. వీనిని నిర్మూలింపవలసినచో అట్లే చేతముగాక, లేక, సంస్కారమే చాలినచో అట్లే సంస్కరించుకొందము. అయ్యవి మనయధఃపాతమునకు కారణము కానపుడును, మన భావివృద్ధికి అవరోధకములు కానపుడును అవి సరిపఱచినఁగాని మనకు ఆర్థికవ్యవహారములయందు ముక్తిగలుగదను మనవారికొందఱియాశయము నిరాధారము. అవి సరిచేసినగాని ఆర్థిక వ్యవహారములయందు ముక్తికలుగనీక ఆటంకపఱతుమను వాదము మూర్ఖపద్ధతి. సాంఘికపరిస్థితులు సవరించువఱకును మనకితరవిషయముల యభివృద్ధిచేకూరదనిచో ఈలోపలనే జాతి క్షీణించిపోవునను భయము వొడముచున్నది.

ఒక్కొక్కకులమువారును కులాభిమానులై వారివారి కులముల నభివృద్ధిపఱచుకొనఁ జేయు ప్రయత్నము లెంతయు శ్లాఘ్యములు. ఇపుడు మనదేశమందొక్కొక్క కులమునకును ఒక్కొక్కమహాసభఁ జేయుచున్నారు. ఇదెంతయు శ్రేయోదాయకము. ఏకులమువారు తదితరులయందు కంటె తుల్యకుల్యులయందు ఆదరమును, సానుభూతియు ప్రేమయునుఁ జూపుట న్యాయమే. ఆయాకులముల సంపూర్ణవిలసనమునకై వారువారు కులసమాధిలోనికిఁ బోవలెను. అట్లుగాని ఏయేయంగములవారికి ఆయాయంగముల నిండుసత్వము తెలియదు. తెలిసినగాని వారు తమతమధర్మముల వివేకముతో నిర్వర్తించుటకు సమర్థులుకానేరరు. అంతర్జాతి సందర్భమునఁ జెప్పిన తత్త్వమెల్లను, అంతర్వర్ణవిషయమునను సరిపోవును. అచ్చట యేయే ధర్మముల నుపపాదించితిమో నిచ్చటయు అవియే ఉపపా

దించుచున్నారము. ఆపట్ల అంతర్జాతి వైషమ్యములు కూడ వని చెప్పియుంటిమి. ఇచ్చటను అంతఃకులవైరములు పన్నికి రావు. అది యేమికర్మమో, మనవారు జేయు యుద్యమములన్ని యు శ్లాఘ్యములై యుండ అచ్చటచ్చట పరస్పరవైరములు ప్రజ్వరిల్లుచున్నవి. ఈ యన్యోన్యజీవనాఽసహిష్ణుతకు పైజె ప్పిన రీతిగనే మొదటికారణము బహిఃపీడన శక్తికిమించినదగు ట. మఱియు రెండవది: ఇపుడు హైందవులమనోవృత్తము భా వశూన్యగా నున్నది. చుట్టుప్రక్కల నెటుజూచినను వేరుపురు గువలె తొలుచుచుండు పాశ్చాత్యమనోవృత్తముచే జాతీయ మనోవృత్తి ఆలోచనరహితగాఁ జేయఁబడియున్నది. స్వజాతిమన స్సంస్థానమున కనురూపములగు తలపులును, భావములును చనిపోయినవి. అన్యజాతి తలపులును భావములును మనస్సం స్థితికి అనుగుణమైనవి కావు కావున మనములోని కెక్కఁజాల కున్నవి. "సముఁడై యెవ్వఁడు ముక్తకర్మచయుఁడై సన్న్యాసియై యొంటిబో। వమహాభీతినొహాకుమారయనుచుర్ వ్యాసుండు జీరంగవృ! కుములుం దన్మయతఁ ప్రతిధ్వనులు చక్కంజేసె మున్నట్టిభూ। తమయుర్......" అను పద్యమునందు చక్కగ చెప్పఁబడిన హైందవాదర్శపరిణామము మఱచిపోయితిమి. దానిబదులు మాత్స్యన్యాయమున ప్రతిపాదింపబడిన హిం స్రాప్రతిరూపమైన శాస్త్రసారమును యనుభవములోనికిఁ దెచ్చు కొన ప్రయత్నించుచున్నాము. (Survival of the fittest in the struggle for existance.)--"జీవనార్థమై జఱుగునిరంతర స్పర్ధయందు పాత్రులే విజయముఁ బొందుదురు. దుర్బలులు నశింతుర"నునీవాదము శక్త్యాసవపానమత్తులై లోకహితాహిత

ములరయ లేక భూతములవైపు పసిరికలుగ్రమ్మిన కండ్లతోఁ జూచి చెప్పినది. అదియే ప్రకృతికి స్వాభావికావస్థయఁట[1]! స్వాభావికావస్థయైన నాయెగాని, అది స్వభావధర్మమని దాని నొకమతముగాబోధించి మానవుఁడు దానిననుభవములోనికి దెచ్చుటచే నయ్యది హింసాప్రతిరూపమయ్యెను. లోకహితార్థమీధర్మము డార్విను దొరగారు గోపురశిఖరములనుండి వెల్లడించిన ఏబదిసంవత్సరములలో మఱెప్పుడుగాని ఏనూ ఱేండ్లలో జఱుగనంత యపకృతి లోకమునందు గావింపబడినది. మనమిపుడాధర్మము నుద్ధరింపఁ జూచుచున్నారము. అయ్యది హిందూ దేశప్రకృతికి విపరీతము. అందుచే నదిఇంకను మనరక్తనాళముల లోని కెక్కకున్నది. ఇది మనము స్వభావమునుఁగోలుపోయి అన్యభావము స్వీకరించుటకు చేయుప్రయత్నముల కుదాహరణము. ఇట్లు రెంటికిం జెడిన మనభావవృత్తము నిర్వస్తుప్రదేశముగా నున్నది. పాడుపడినయిల్లు దయ్యములకును, చోరులకును, గబ్బిలములకును శరణాలయముగ నుండలేదా? అట్లే భావరహితమైన మనజాతీయమనోవృత్తము బాహ్యదుర్భావములకు శరణ్యమైయున్నది. ఎట్టి దుర్మోహారోపణకైనను నయ్యది అతిశీఘ్రముతోడను మిక్కిలి యాదరముతోడను ప్రతిస్పందించును. అందుచేతనే స్వార్థపరాయణులును నిజకార్యైకదృక్కులును ప్రయోగించు దుర్మోహారోపణ దేశమునందు ప్రజ్వలించి ఇంతమంట మండుచున్నది.

---

1. దీని గుణాగుణములు విస్తరించుట నిచ్చట ప్రస్తుతముగాదు. కాన సందర్భవశమున నొకటిరెండు మాటలతో ముగింతును.

ఇపుడు పైజెప్పిన రాష్ట్రప్రతివాదమందు సూచించిన కార్యధోరణితో పనిఁబూనిన రాఁగల నుపద్రవము చర్చింతము: ఇతరజాతివారిని మన ఆంధ్రదేశములోనికి రాజోద్యోగముల పేరనో, మఱేపేరనో విశేషముగా రానిత్తమనుకొందము. దాని వలని నష్టముమాత్రము మనమాలోచింపఁబనిలేదా? నేను చెప్పునది వారికిచ్చు వేతనరూపమైన ధననష్టముగాదు. అది గణనీయముగాదు. దానికొఱకు ఇంతయాందోళన మనముచేయ వలసిన ఆవశ్యకములేదు. నేను చెప్పునది దీనియందుగల రహస్యోపద్రవము. స్వత్వజ్ఞానములేక స్వత్వమును కాపాడుకొన లేని స్థితియందుండుజాతితో మఱియొకజాతి డీకొన్నపుడేమి జఱుగునో కొంచెము వివరించెదను. సజాతుల యభివృద్ధియందు అన్యజాత్యాదేశము[1] స్వతసిద్ధమేగాని జాతివినిమయము[2] ప్రకృతి విరుద్ధము.[3] సజాతులవిలసనమం దెచ్చోఁజూచినను ఈవ్యవస్థ తెలియుచునే యున్నది. పాశ్చాత్యులు ప్రోత్సహించి అమెరికా దేశములోనికి చొరనారంభించినదాదిగా అచ్చటి రెడ్ఇండియనులజాతి నామావశిష్టమయ్యెను. అట్లే ఆఫ్రికాఖండవాసులగు నీగ్రోలు పాశ్చాత్యుల దాడికోర్వలేక స్వరూపనాశనముఁ జెందుచున్నారు. న్యూజీలాండు, ఆస్ట్రేలియా దేశములలో సైతము జాత్యాదేశమే కానవగుచున్నది. ఆర్యులు హిందూ దేశమునకు వచ్చినపిమ్మట తత్పూర్వముననుండిన దస్యులు

---

1. Substitution of one race by another.
2. Interchange between two races or classes.
3. This does not contradict my Statement in the preface that 'Natural selection' is an abberation from the normal condition of the universee. for so long as it is an abberation, it exists and therefore must enter our calculations.

రూపుమాసిపోయిరి. లేదా ఆర్యులలో నైక్యమైపోయిరి. ఇంగ్లాండుదేశములో ఆంగ్లోసాక్సనులు వచ్చినవెనుక తత్పూర్వమున బ్రిటెనులో నివాసముజేయుచుండిన 'బ్రిటన్సు' అనుజాతి వారు జాతినాశనమునుపొంది వారిలో లీనమై స్వత్వభ్రంశమునుపొందిరి. ఈసిద్ధాంతము జంతువులవిషయమున సహితము వర్తించుచున్నది. ఆస్ట్రేలియాగుఱ్ఱములను, అరబ్బీగుఱ్ఱములను హిందూదేశములోనికి దిగుమతిఁజేయ నారంభించిన వెనుక సైంధవము మొదలగు ఆజాతి[1]గుఱ్ఱములు జాతివినాశము నొందినవి. ఇంకనిట్లెన్నియేని దృష్టాంతములు గాననగును. అట్లే ఇపుడాంధ్రమున అరవలు కర్ణాటులు మహారాష్ట్రులు ప్రబలినచో అంతవఱకును ఆంధ్రజాతి వినాశమునొందినట్లే. ఇదిహాస్యాస్పదముగాఁ గన్పట్టునేమోగాని ఒక్కింత యోచించిన దీనితత్వము సంపూర్ణముగా మనస్సునకు రాఁగలదు. ఈచిన్నవిషయమును గమనింపుఁడు. మార్వారీవారికి మనదక్షిణదేశమున చోటిచ్చిన దోషఫలము నేఁడుమనకందఱకిని అనుభవరీత్యా తెలియుచుండుట లేదా? ఎచ్చటధనముగలవాఁడుండినను మార్వారీవాఁడే. వాఁడు మేయుపచ్చికబీడు దక్షిణదేశమున, వాఁడు పాలిచ్చునది ఉత్తరదేశమువారికి. ధనహీనుఁడై పైవస్త్రముతో ఉత్తరదేశమునుండి వచ్చిన మార్వారీవానికి వారు ధనముఅప్పిచ్చి వానిని వ్యాపారమునందు నెలకొల్పి వాని నభివృద్ధికి దెచ్చుచుండుట చూచుటలేదా ? అది వానియందు దోషముగాదు. కాని మనకుపద్రవకారియే. మనదేశమున కేదైన యిక్కట్టు సంభవించిన వాఁడు తనధనమెత్తికొని తనదేశమునకు పాఱిపోవునుగాని

1. Local breeds.

మనతోఁటి కష్టములందు సైతము పాటుపడునా? మీదుమిక్కిలి యిప్పుడు 'మార్వారీఇంటరెస్టులను' కాపాడుకొనుటకై వారు మనలెజిస్లేటివ్ కౌన్సిలులో తమకుస్థానములు కావలెనని కొంచెముకొంచెముగా ప్రస్తావించుచున్నారు. ధనాఢ్యులుగావున వారియభీప్సితము నెఱవేరినను నెఱవేరవచ్చును. వారిని మన దేశమునకు రమ్మని ఎవ్వరు పసుపుకుంకుమబెట్టి బిలిచిరి? మన దేశమున వీరియింటరెస్టులు కాపాడుకొనుట యనగా మనబారి నుండియేగదా? సమయమువేచి స్వలాభార్థమైవచ్చి, ఇపుడు 'తమఇంటరెస్టులు' కాపాడుటకు రిప్రెజెంటేషన్ కావలెనఁట! ఇవన్నియు జాత్యాక్రమణరహస్యములు. వానిని నేనుదూషించుట లేదు. స్వజాతివిజృంభణకు అదితప్ప వేరుమార్గము మాత్స్యన్యాయతత్త్వావలంబులగు యాధునికులకుఁ గన్పట్టదు. ఈమాత్స్యన్యాయతత్వము నేనుమనవారికి బోధించుటలేదు. అది మిక్కిలి దూష్యము. కాని ఆయాదర్శములతో జాత్యాక్రమణము చేయవచ్చినవారి బారినుండి తప్పించుకొనుటకు మనము దానిరహస్యప్రవృత్తిని గ్రహించవలెను.

పైజెప్పిన జాత్యాదేశమును, దానివలనఁగలుగునుపద్రవములును వారింపవలెనన్న మనము ఎవరైననేమి అనుయాదాసీన్యమును దూరీకృతము చేయవలెను. ఒకజాతిస్థానమందు మఱియొకజాతిసత్వములు ప్రబలుచుండుట ఆజాతికి వినాశహేతువని మనవారు విశదముగా తెలుసుకొనవలెను. కాని పాఠకమహాశయులొక్క యాక్షేపణ సేయనగును. ఇంగ్లాండు దేశమున నెన్నియోజాతులవారు ఇటీవల వలసలువచ్చియు ఆంగ్లేయజాతి సుస్థితినుండలేదా? వారివలన ఆంగ్లజాతి నశించి

నదా? అని ప్రశ్నింపవచ్చును. దీనికిజవాబు ముందేచెప్పియు న్నాను. ఆంగ్లేయజాతి వ్యవస్థకును మనజాతి వ్యవస్థకుమెం తయో తారతమ్యము గలదు. ఆంగ్లేయజాతి వృద్ధిదశయం దున్నది. మనమున్ననో ఇకమీద వృద్ధికావలసిన వారము. ఆంగ్లే యుల జాతియందు స్వవ్యక్తిజ్ఞానము విశేషించియున్నది. వ్యక్తిజ్ఞానము మిక్కిలిగానుండు దేశమునకు స్వజాతివ్యక్తినిలుపు కొనలేని జాతివారువలసవచ్చి తమదేశమునకు రాకపోకలులేక వెలిమైలేని అట్టివారు మాత్స్యన్యాయమున ఆజాతులలో కలిసి పోదురు. రోమన్ కాథలిక్ క్రీస్తులగు రాజుల పోరు పడలేక ప్రెం ఛీహ్యూజినో లెందఱో ఇంగ్లాండుదేశములోనికి వలసవచ్చి తమ తమ జాతివ్యక్తిని కోలుపోయి వ్యక్తిపూర్ణులగు ఆంగ్లేయులలో నైక్యమైరి. విలియమ్‌దికాంకరర్ కాలమందుసంపూర్ణవ్యక్తితో వచ్చిన నార్మనులుసైతము ఇంగ్లాండుదేశమునకు రాజులై నెగ డినను స్వజాతులతో గమనాగమనములులేకకొద్దికాలములోనే, జాతివ్యక్తిని నిలుపుకొనలేక ఆంగ్లేయజాతులవారిలో కలిసిపో యిరి. ఆంధ్రదేశమున్న తదశ యందున్న పుడు వలసవచ్చిన పుదూ రు, తుమ్మగుంట, కోనసీమ ద్రావిడులు సైతము మాతృజాతివి స్మరణచే ఆంధ్రత్వమును స్వీకరించిరి. ఇదంతయు ప్రయాణసౌక ర్యములేని పూర్వకాలమున. ఇపుడన్ననో ప్రయాణసౌలభ్యము గలదు. స్వజాతివ్యక్తిఁ బోషించుకొన వలసవచ్చినవారికి సాధ్య పడును. కానడాదేశమునందలిగల ఐరిషుజాతివారు ఐర్లండుకు స్వరాజ్యముకావలెనని కోరుచున్నారు. అమెరికాదేశమందలి జపానీజాతివారు మాతృజాతివ్యక్తినిపోషించుకొనుచు అమెరికా యందు హక్కులకై పోరాడుచున్నారు. ఇవన్నియు ప్రయాణ

సౌలభ్యముచే తనేగదా? కావున ఈదినములలో మన యీ యౌదాసీన్యము అనర్థకారి. మనకును ఆంధ్రవ్యక్తిజ్ఞానము సంపూర్ణముగా నలవడినప్పుడు ఈ విషయమున నుదాసీనులమై యుండవచ్చును. ఆంగ్లేయులుసైతము ఇటీవలగదా 'పరదేశస్థులు తమదేశమునందు భూస్వాములుగా నుండగూడదను' నిషేధముఁ దొలగించినది!

స్వజాతివ్యక్తిపరిజ్ఞానము సంపూర్ణముగనుండు అమెరికాదేశములో జపానీలు వలసవచ్చినపుడే అమెరికాలోని శ్వేతుల కింతనష్టము రానున్నపుడు, అయ్యది పరిపూర్ణముగలేక అధోలోకముననుండి ఇపుడే తల యెత్తవలెనని జూచు ఆంధ్ర జాతి స్థానమం దితరులు చొచ్చుట ఎంత ప్రమాదకరము? ముఖ్యముగా నట్టి వలసవారు అధికారవ్యాజమున వచ్చి రాజ్య పాలనమందు జోక్యముగలవారై రేని మనజాతికి యమమహిష ఘంటానాదములు వినబడుచున్నట్లే. అనివార్యమైన సందర్భములలో మనమేమియు సేయునది లేదుగదా, వారింపగలిగిన విషయములలోఁగూడ నుదాసీనులమైనచో సద్గతి వడయు టెప్పుడు? మన ఇప్పటిదశయందు ఆంధ్రదేశమును అన్యులకు చిక్కఁబట్టియిచ్చినచో మనజాతికి మనమే విషముఁ బోసినవార మగుదుము. రాష్ట్రవాదులు రాజకీయోద్యోగములకై పాటుబడుచుండుట లేదు. ఆంధ్రవ్యక్తిపోషణకు అంతరాయములు గలుగుచున్నవనియు, ఆంధ్రజాతిక్షయ మందుచే ప్రతినిముషమును సన్నిహితమగుచున్నదనియు, వారిహృదయములు తల్లడిల్లుచున్నవి. వారిమొఱ రాష్ట్రప్రతివాదులు చెవియొగ్గి విందురుగాక!

రాష్ట్రవాదులు ప్రతిపాదించు ఆంధ్రమహోద్యమము అత్యున్నతాదర్శములు గలయది. ఆంధ్రజాతిఅంకురము వనస్పతివలె మహావృక్షమై తనయూడలు దేశదిగంతములనాటి తన శాఖాచ్ఛాయల నెందఱో అనదజాతులవారు విశ్రాంతిదీర్చుకొనునట్లు చేయుపూనికతో ఆంధ్రులు పనిఁబూనుచున్నారే గాని, ఎద్దియో క్షుద్రలతవలె అన్యాశ్రయములేక నిల్వలేని దానినిగాఁ జేయుటకుకాదు. జాతివ్యక్తి మఱచిపోయినమనలను జూచి మనపూర్వులగు మహాంధ్రులు విద్యారణ్యకృష్ణరాయాదులు స్వర్గముననుండియు ఎంత విషాదపరులగుచున్నారో మన మెఱుంగుటలేదు. వారి మనోవేదనఁబాపి పుత్రఋణముఁ దీర్చుకొనుట ఆంధ్రులకు విధి. మనవారు రాజకీయోద్యోగాది స్వల్పాదర్శములమాని మహాదర్శముల గ్రహింతురుగాక. కాకిదృష్టితోఁ జూచుటమాని గరుత్మంతునిదృష్టితోఁ జూతురుగాక. ఆంధ్రత్వము ప్రతివానియందును పరిపూర్ణోదయముం గాంచుఁగాక!

---

Printed at the India Printing Works, Madras.

|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
| --- | --- |

| | |
| --- | --- |
| పుస్తకం సంఖ్య | TPLA 103 B 156 |
| పుస్తకం పేరు | ఆంధ్ర [illegible] |
| తారీఖు | 25/10/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 73 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | C, D, 60, BCI, B |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Ruksana |
| పేజీలు విడదీసినది | Ruksana, |
| స్కాన్ చేసినది | Heena |
| పరీక్ష చేసినది | THASIN |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good. |